శ్రీః.

గీ॥ హరిని భజియించి మద్గురువరు నుతించి
జైమినిర్షి భట్ట శబరుల సంస్మరించి
బాలురకుఁ బూర్వమీమాంస ఫక్కి తెలియఁ
దెనుఁగుభాషను సులభశైలిని రచింతు.

గీ॥ కూచిమంచి కులాంబుధి కువలయాప్తుఁ
డైన కర్పూరసుందరు నాత్మజుండ
నతుఁడ గోపాలకృష్ణమ్మ నామకుఁడను
కోర్కె వేడెద దీనిఁ గైకొనుఁడు బుధులు.

---

శివాయగురవేనమః.

పిఠాపురం
28_4_1929.

మహారాజశ్రీ కూచిమంచి గోపాలకృష్ణమ్మగారు రచించిన ఆంధ్రమీమాంసాపరిభాషను, ఆంధ్రమీమాంసార్థసారమును, ఆంధ్ర మీమాంసా న్యాయదీపికను స్థాలీపులాక న్యాయముగ నచ్చటచ్చట చూచితిని.

ఆంధ్రభాషలో నిట్టి గ్రంథములు మిక్కిలి యపూర్వములు. ఆంధ్రదేశమున మీమాంసా శాస్త్రప్రచారము మిక్కిలి యరుదుగ నున్నది. ఇట్టి సందర్భమున మీమాంసాప్రకరణ గ్రంథములను తెనుగుభాషలో రచించుట మిక్కిలి ప్రశంసనీయము. శాస్త్రసిద్ధాంతములను సర్వజన సుబోధముగ చేయబూనుట వీరికిగల వైదుష్యమును అనుభవమును సహస్రముఖములచాటుచున్నది. ఇట్టి యపూర్వ గ్రంథములను నిర్మించి యాంధ్రదేశమునకును ఆంధ్ర వాఙ్మయమునకును మహోపకారము నొనరించిన శ్రీ గోపాలకృష్ణమ్మగారు సర్వాత్మనా ఆంధ్రలోకముయొక్క కృతజ్ఞతకు పాత్రులు కాగల రని నా దృఢనిశ్చయము. ఇటులనే వీరు దర్శనాంతరములనుకూడ నాంధ్రీకరించి లోకమునకు మహోపకారము నొనరింతురుగాక.

శ్రీపాద లక్ష్మీనృసింహశాస్త్రి
మహారాజాస్థానవిద్వాన్_పిఠాపురం.

మ॥ శ్రీ॥ శ్రీయుత కూచిమంచి గోపాలకృష్ణమ్మ (M.A.L.T.) గా రాంధ్రీకరించిన యర్థసంగ్రహమను మీమాంసాగ్రంథమును జదివితిని. అయ్యది సుకుమారమైన చక్కని గ్రాంథికభాషలో రచియింపఁ

బడియున్నది. సంస్కృతానభిజ్ఞులై యాంధ్రభాషమాత్రమే యభ్యసించియున్న వారికిఁగూడ, మీమాంసాశాస్త్రవిషయములఁ గరతలామలకములుగ నొనరించుటకుఁ దగినంతటి యర్థవ్యక్తి యీగ్రంథమున నగపడుచున్నది. శాస్త్రీయవిషయముల నింత సుబోధము గావించుచున్న వీరి రచనాచాతురి కడుంగడుఁ బ్రశంసనీయమై యితరులకు మార్గదర్శకముగా నున్నది. ఇట్టి గ్రంథము లీవఱ కాంధ్రవాఙ్మయమున వెలువడియుండలేదని నా నమ్మకము. ఇట్లే వీ రితర మీమాంసాగ్రంథములనుగూడఁ ద్వరలోఁ బరివర్తించి, యాంధ్రదేశమున మృగ్యమైయున్న మీమాంసాదర్శనము నుద్ధరించి, యీ దేశమున కమూల్యమగు నుపకార మొనరింతురుగాక యని మఱిమఱి కోరుచున్నాఁడను.

(True Copy)

చిట్టిగూడూరు, 1-2-28. (Sd.) దువ్వూరి వేంకటరమణశాస్త్రీ,
నారసింహాసంస్కృతకళాశాల.

V. Ch. Sitaramaswami Sastri, President, Faculty of Oriental Languages, Member, Senate, Academic Council and Board of Studies in Telugu of the Andhra University, Lecturer in Telugu, Maharaja's Sanskrit College.

మ॥ రా॥ శ్రీ॥ కూచిమంచి గోపాలకృష్ణమ్మ యమ్. ఏ.,గారి రచియింపఁబడిన మీమాంసార్థసారమను ప్రకరణగ్రంథమును నే జూచితిని. ఈ గ్రంథము లౌగాక్షిభాస్కరవిరచితమగు సంస్కృ భాషలోనున్న యర్థసంగ్రహము నాధారముగఁగొని వ్రాయఁబడినఁ

ఇయ్యది ప్రసన్నము సలక్షణమునగు నాంధ్రభాషలో వ్రాయఁబడినది. ఆంధ్రభాషలో నిట్టి మీమాంసా విషయకగ్రంథము బయలువెడలి యుండలేదు. ఆంధ్రులు స్వతంత్రముగ మీమాంసాదర్శనజ్ఞానమును సంపాదించుట కిది మిక్కిలిగ నుపయోగించును. ఆంధ్రవాఙ్మయమున కిట్టి నవీనాభ్యున్నతి గల్గించు గ్రంథమును రచించుటకు దారిచూపిన గ్రంథకర్తగారి యుద్యమ మెంతయు శ్లాఘ్యము. గ్రంథకర్తగా రిట్టి గ్రంథముల నింకను వెలయించి యాంధ్రభాషాసేవకుల కృతజ్ఞతకుఁ బాత్రులగుదురుగాక. ఇట్టి యుత్తమగ్రంథమునకుఁ దగిన ప్రోత్సాహ మొసఁగి విద్యాశాఖవా రాంధ్రవాఙ్మయాభివృద్ధి నొనరించుట యత్యావశ్యకమయియున్నది.

(True Copy)

Vizianagaram, 3-2-1928. (Sd.) వఝల చినసీతారామస్వామిశాస్త్రి

J. RAMAYYA PANTULU.

Muktiswaram,
Tottaramudi P. O.,
Godavary Dt.,
*Date/ 3—4—1928.*

I have gone through the first two parts of Āndhra Mīmāmsārthasāra by Mr. K. Gopala Krishnamma, M. A., L. T. It is an original work in Telugu containing an exposition of the Fundamental principles of the Purva Mimamsa Darsana which has been rather neglected hitherto in the Telugu Country. It is written in chaste and simple Telugu and it is really creditable to the author that he has been able to hit on

just the sort of style which should be used in Telugu books
Scientific subjects. The book under consideration will, in m
opinion enrich the Telugu literature and is fit to be the first
a series of Scientific books in Telugu to be published by th
Andhra University.

(True copy)

(Sd.) J. RAMAYYA.

మహారాజశ్రీ కూచిమంచి గోపాలకృష్ణమ్మగారిచే ఆంధ్రీ
రింపఁబడిన పూర్వమీమాంసాపరిభాషా అర్థసారమీమాంసాన్యాయ
దీపికలను నేను పరిశీలించి చూచినాను. ఈ మూడుగ్రంథములు మూ
గ్రంథములందుండు విషయములను స్పష్టముగా బోధించుచున్నవి
తెనుఁగువిద్యార్థులకు సంస్కృతగ్రంథములందుండు మీమాంసావి
యములు ఈగ్రంథములవలన స్పష్టముగాఁ దెలియఁగలవు.

(True Copy)

బుచ్చమ్మఅగ్రహారము,
అమలాపురము,
30-4-1928.

(Sd.) మరువాడ శంభన్నశాస్త్రి,
న్యాయవేదాంతాధ్యాపకుడు

మహారాజశ్రీ కూచిమంచి గోపాలకృష్ణమ్మగారిచే రచియింపఁ
బడిన (1) ఆంధ్రమీమాంసాపరిభాష (2) ఆంధ్రమీమాంసా

సారము (3) ఆంధ్రమీమాంసాన్యాయదీపిక, యనెడి మూఁడు గ్రంథ
ములను నేను పరిశీలించిచూచినాను. ఈగ్రంథములు సంస్కృతభాషా
జ్ఞానములేని యాంధ్రులకు, పూర్వ మీమాంసాశాస్త్రమునందలి
విషయములను బోధచేయుట కత్యంతోపయోగముగానున్నవి. వీరు
ఇంతశ్రమను వహించి లోకోపకారము చేసినందుకుగాను నేను
అత్యానందమును బొందుచున్నాను. మిక్కిలి గహనమైన శాస్త్ర
సిద్ధాంతసారమును సంగ్రహించి అతిసులభమైనశైలిని ఆంధ్రభాషలో
వ్రాసినారు. కనుక ధనసమర్థులైన విద్యాపోషకులు ఈగ్రంథము
శక్యమయినంత త్వరలో ప్రచురింపఁజేసి లోకమునకు ఉపకరింతురని
నేను దృఢముగా నమ్ముచున్నాను.

(True Copy)

ముక్కామల,
అమలాపురం తాలూకా,
తూ॥ గోదావరిజిల్లా.

(Sd.) భమిడిపాటి సోమనాధశాస్త్రి,
19-1-1929.

---

మహారాజశ్రీ కూచిమంచి గోపాలకృష్ణమ్మగారు రచించిన
యాంధ్రపూర్వమీమాంసా గ్రంథములు స్థాలీపులాకన్యాయమున
వింటిని.

ఆంధ్రభాషలోఁ బూర్వమీమాంస నవతరింపఁజేయుటకుఁ
దీర్ఘకరులు వీరే. పుణ్యపాపనిరూపణాధారమగు నపూర్వఫలవాద
మతగ్రంథము లాంధ్రమున నపూర్వములగుట లోపమే. ఆలోపము

దీర్చి మనయాంధ్రులకు నత్యంతసులభమును సలక్షణమునగు నాంధ్ర భాషలో దుర్బోధమగు విషయమును సుబోధముగావించిన వీరియెడ నాంధ్రులు కృతజ్ఞులయి వీరిగ్రంథములు వ్యాప్తిలోనికివచ్చు సాధనములు తమతమశక్తి ననుసరించి చేయుటవిధి. ఆంధ్రాభిమానమప్పుడే యన్వర్థమగును. ఈగ్రంథములవలనఁ బ్రత్యాంధ్రుఁడును వేదమత సిద్ధాంతములు గ్రహింపఁగలఁడు. అప్పుడాంధ్రుల కాంధ్రవేదము గావలయునను నాసక్తి కవకాశము గలుగును. ఆంధ్రవేదమవతరించు నదృష్ట, మాంధ్రులకుఁ గలుగనిదియే ఓంకారము. అని నాతలంపు.

(True Copy.)

పిఠాపురము.
18-2-1929.

ఇట్లు విధేయుఁడు.
(Sd.) శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రి



# ఉపోద్ఘాతము

ఈ లోకమునందలి యెల్ల ప్రాణులకును 'సుఖము' 'దుఃఖము' అను రెండు విధములగు ననుభవములుకలవు. 'ఈ రెండింటికిని కారణ మేమై యుండును?' అనుప్రశ్నమున కిట్లు సమాధానము చెప్పనగును. ఈ ప్రపంచమున నెక్కువ సుఖము ననుభవించుచున్న మనుజుని గూర్చి—"ఇతఁడు చాల సుఖము ననుభవించుచున్నాఁడు. ఇతఁడు గొప్ప పుణ్యాత్ముఁడు. ఈ జన్మమునందుఁగాని పూర్వజన్మమునందుఁ గాని యీమనుష్యునిచే నేదేనొక గొప్ప పుణ్యము సంపాదింపఁబడి యుండును. ఏదోయొక పుణ్యమును సంపాదించినఁగాని యిట్టిసుఖము లభింపనేరదు" అని ప్రజ లూహించుటయేకాక, యొండొరులతోఁ గూడఁ జెప్పుకొందురు. ఇట్లే యెక్కుడుదుఃఖము ననుభవించువానిని గూర్చి "ఇతఁడు చాల దుఃఖము ననుభవించుచున్నాఁడు. ఇతఁడు గొప్ప పాపాత్ముఁడు. ఈజన్మమునందుఁగాని పూర్వజన్మమునందుఁ గాని యీమనుజున కేదోయొక గొప్పపాపము సంభవించియుండును. ఏదేనొక పాపము మూలముగాఁ గాని యీ మనుష్యుని కిట్టి దుఃఖము రానేరదు" అని ప్రజ లూహించుటయేకాక యొండొరు లతోఁగూడఁ జెప్పుకొందురు. ఇట్లు లోకమునం దనుభవింపఁబడు సుఖదుఃఖములకు వరుసగా పుణ్యపాపములు కారణములని తెలియు చున్నది. ఈ పుణ్యపాపములు రెండును నిప్పుడు సుఖదుఃఖముల ననుభవించుచున్న మనుజులచే, వారి వారి పూర్వజన్మములయందుఁ గాని యీ జన్మమునందుఁగాని యాచరింపఁబడిన కర్మములవలనఁ జనించును. పుణ్యము జనింపఁజేయు కర్మములు "ధర్మము" లనియు,

పాపమును జనింపఁజేయు కర్మములు 'అధర్మము' లనియు వ్యవహరింపఁబడుచున్నవి. పైని వివరింపఁబడిన రీతిని, ప్రతి మనుజుఁడును దుఃఖము నెప్పుడును గోరక, యెల్లప్పుడు సుఖమునే కోరుచుండుటం జేసి, యీ ధర్మాధర్మములను గూర్చి యెల్లరకును దప్పక తెలియఁ దగియున్నది. వీనినిగూర్చి తెలిసికొనుటకుఁ బ్రయోజన మేమనఁగా, 'ఇట్టి కర్మములు ధర్మములు, ఇట్టి కర్మము లధర్మములు' అని స్పష్టముగాఁ దెలిసికొనినవాఁడు 'అధర్మములను' విడిచి ధర్మములనే తనకుండు సామర్థ్యమును బట్టియు, నవకాశమునుబట్టియు నాచరింపఁ గలఁడు. వీనిని స్పష్టముగాఁ దెలిసికొననిపక్షమున మానవుని జ్ఞానమత్యల్ప మగుటం జేసి యతఁడు 'అధర్మమును' ధర్మమని భ్రమించి యాచరించుటయు, ధర్మముల నధర్మములనుగా నెంచి విడుచుటయును సంభవించెడినిగదా! కనుక, ధర్మాధర్మములను వివరముగాఁ దెలిసికొనవలయునని యేర్పడుచున్నది.

"ఇంతకుముందు తెలియఁబడని పదార్థమును దేనినైనఁ గ్రొత్తగా సిద్ధింపఁజేయుటకై 'దాని కొక [1]దోషరహితమగు లక్షణము,' 'దానిని బోధించు ప్రమాణము' నను నీరెండును నావశ్యకము లగుచున్నవి." అను [2]న్యాయము ననుసరించి, యీ ధర్మాధర్మముల విషయమై నిర్దుష్టమగు లక్షణము, సరియైన ప్రమాణము, నను నీరెండును దెలియం దగియున్నవి. "ఏకర్మము, దాని నాచరించువాని యిష్టము నుత్పాదింపఁ గలుగుటంజేసి, యట్టి ఫలమును గోరువానిచేఁ జేయఁబడవలసినదిగా వేదమునందు బోధింపఁబడుచున్నదో, యట్టి కర్మము 'ధర్మ' మనఁబడుచున్నది" అనునది ధర్మ

---

1 అతివ్యాప్తి, అవ్యాప్తి, అసంభవమనను నీమూఁడు దోషములలో నేదియు లేకుండుట, లక్షణమునుదాని కావశ్యకము.

2 న్యాయము:—"లక్షణప్రమాణాభ్యాం హి వస్తుసిద్ధిః"

మునకు లక్షణము. ఉదాహరణము :— యాగములు, ఇష్టులు మున్నగునవి. "ఏకర్మము, దాని నాచరించువాని కనిష్టము నుత్పాదించున దగుటంజేసి, యెవ్వరిచేతను జేయఁబడనిదిగా వేదమునందు బోధింపఁబడుచున్నదో యట్టి కర్మము 'అధర్మ' మనఁబడుచున్నది." అనునది అధర్మమునకు లక్షణము. ఉదాహరణము:—ఎఱ్ఱయుల్లిని భక్షించుట, అసత్యము పలుకుట, మున్నైనవి. ఈ ధర్మాధర్మములను వివరముగా బోధించుటకై వేదము, స్మృతి, శిష్టాచారము నను మూఁడు ప్రమాణములు గలవు. లక్షణము ప్రమాణము నను నీ రెండును వేదమును సంబంధించున వగుటంజేసి దానిచే బోధింపఁబడు విషయముల [1]మూలముననే తెలియఁదగియున్నవని యేర్పడుచున్నది.

వేదమునందు 'మంత్రములు,' 'బ్రాహ్మణములు' అను రెండు భాగములు కలవు. ఇట్టి వేదముచే 'కర్మము,' 'ఉపాసన,' 'జ్ఞానము,' అనెడి మూఁడు విషయములు బోధింపఁబడుచున్నవి. వీనిలో "ఏదో యొక దేవత నుద్దేశించి యాయా నిర్దిష్టమగు ద్రవ్యమును మంత్రపూర్వకముగా సమర్పించుట" అను నిట్టిది కర్మ మనఁబడుచున్నది. బ్రహ్మము న[2]పాస్యముగాను, జీవుని [3]నుపాసకునిగాను భావించుటయె 'ఉపాసన,' యనఁబడుచున్నది. బ్రహ్మమును జీవుని నొక్కటిగానే భావించుట 'జ్ఞాన' మనఁబడుచున్నది. ఇన్ని విషయములన్ బోధించు వేదమునందు ముందు వెనుకలుగా నుండు నర్థములకుఁ బరస్పర విరోధము లచ్చటచ్చట భాసిల్లుచుండుటంజేసి, యీ వేదమునకు వాస్తవమగు నర్థ మేది? యని యాకాంక్ష కలుగఁగా, దీని నుపశమింపఁ జేయుటకొఱకే [4]మీమాంసాశాస్త్రము రచింపఁ

---

1 న్యాయము—"మానాధీనా మేయసిద్ధిర్మానసిద్ధిశ్చలక్షణాత్!"

2 ఉపాసింపఁబడునది.

3 ఉపాసించువాఁడు.

4 మీమాంస, విచారము, విమర్శనము, అనునవి పర్యాయపదములు.

బడినవి. పైని జెప్పఁబడిన మూఁడు విషయములలో 'ఉపాసన' యను నది యొకానొకవిధమైన కర్మమే యగుటంజేసి, వేదమునందు కర్మము, జ్ఞానమునను నీరెండు విషయములుమాత్రమే ప్రతిపాదింపఁ బడుచున్నవని చెప్పఁదగును. ఇట్లు వేదమునందుఁ గర్మమును బోధించు భాగము కర్మకాండమనియు, జ్ఞానమును బోధించు భాగము జ్ఞానకాండమనియు వ్యవహరింపఁబడుచున్నది. వేదమునందు 'మంత్రములు,' 'బ్రాహ్మణములు' నను రెండు భాగములు గలవు. బ్రాహ్మణముల తుదినుండు భాగమునకు 'ఉపనిషత్తులు' అని పేరు. వీనిలో మంత్రములును, ఉపనిషత్తులు గాక మిగిలిన బ్రాహ్మణములును, కర్మములను బోధించుటంజేసి కర్మకాండమని చెప్పఁబడుచున్నవి. ఉపనిషత్తులు, '[1]బ్రహ్మము, జీవుఁడు, నను నీయిరువురును, వ్యవహారమునందు వేఱుగా నుండునట్లు భాసిల్లుచున్నను, వాస్తవముగా నొకే చైతన్యరూపమగు వ్యక్తియని భావించుట' యనెడి జ్ఞానమును జనింపఁజేయున వగుటం జేసి 'జ్ఞానకాండము' అని చెప్పఁబడుచున్నవి. ఉపనిషత్తుల కర్థమగు బ్రహ్మమును గూర్చిన 'మీమాంస' యనెడు శాస్త్రము, పూజ్యుఁడైన బాదరాయణునిచే, సూత్రముల మూలమున బోధింపఁబడినది. ఇందొక్కొకదానికి నాలుగు పాదములు గల నాలు గధ్యాయములు గలవు. ఈ సూత్రముల సంఖ్య యించుమించుగా నేనూటయేఁబదినాలుగు. ఈ సూత్రములయందు బ్రహ్మము బోధింపఁబడుటవలన, వీనికి బ్రహ్మసూత్రములనియు, వేదమున కంత్యమందుండునవి యగుటచే వేదాంతము లనఁబడు 'ఉపనిషత్తుల' సారమైన బ్రహ్మమును బ్రతిపాదించున వగుటవలన నీ సూత్రములకే వేదాంతసూత్రములనియును పేళ్లు గలవు. ఈ సూత్రములయందు బ్రహ్మము ప్రధానవిషయ మగుటవలన, వీని మూలముగా వివరింపఁ

---

1 బ్రహ్మము=పరబ్రహ్మము=పరమాత్మ=శుద్ధచైతన్యము.

బడిన మీమాంసాశాస్త్రమునకు 'బ్రహ్మ మీమాంస' యను పేరు కలదు.

పైని( జెప్పఁబడిన కర్మకాండమను వేదభాగమునం దావశ్యక మగు కర్మమును గూర్చిన విచారరూపమైన శాస్త్రము, బాదరాయణుని శిష్యులలో నొకఁడైన జైమినిమహామునిచే, సూత్రరూపముగా రచింపఁబడినది. ఇందుఁ గర్మమును గూర్చిన మీమాంస యావశ్యక మగుటం జేసి, యీ శాస్త్రమునకు 'కర్మమీమాంస' యనియు, పైని వివరింపఁబడిన రీతిని వేదమునందు విధింపఁబడిన కర్మము ధర్మ మనఁబడుటవలన దీనికే 'ధర్మమీమాంస' యనియును పేళ్ళు సిద్ధించుచున్నవి. బ్రహ్మజ్ఞానము కలుగుటకుఁ బూర్వము [1]చిత్తశుద్ధి యావశ్యక మగుటం జేసియు, నట్టి చిత్తశుద్ధిని గలిగించుటకు [2]ధర్మముల నాచరించుట ముఖ్యసాధన మగుటం జేసియు, 'కర్మకాండ మనునది వేదమునందలి మొదటి (పూర్వ) భాగ మగుటం జేసియు, నీ కర్మములను గూర్చిన మీమాంసకు 'పూర్వ మీమాంస' అను పేరు సిద్ధించుచున్నది. ఉపనిషత్తులు వేదమందలి తుదిభాగ మగుటవలనను, వీనిచే బోధింపఁబడు బ్రహ్మమును గూర్చిన మీమాంస, కర్మమీమాంసకుఁ బిదపనే యావశ్యక మగుటవలనను, నీ బ్రహ్మమీమాంసకు వేదాంతమనియు 'ఉత్తర మీమాంస' యనియును పేళ్ళు సిద్ధించుచున్నవి. ఈ పూర్వమీమాంసయందుఁ బండ్రెం డధ్యాయములు గలవు. వీనిలో నొక్కొకదానికి నాలుగేసి పాదము లుండుట యేకాక, మూఁడవ యధ్యాయమునకును, ఆఱవ యధ్యాయమునకును, పదియవ యధ్యాయమునకును, నాలుగేసి పాద

---

1 మనస్సు, రాగము, ద్వేషము మున్నగు వృత్తులు లేకుండ, నిర్మలముగా నుండుట.

2 విహితమైన కర్మములు.

ము లధికముగాఁ గలవు. కాఁగా నీ పండ్రెం డధ్యాయములకును మొత్తముగా నఱువది పాదములు గలవు. ఈ పండ్రెండధ్యాయముల యందు నించుమించుగా వేయి [1]యధికరణములుగలవు. ఈశాస్త్రము నందు వివరింపఁబడి లోక వ్యవహారమునకుఁగూడ నుపయోగించు 'న్యాయములు' వేయికంటె నెక్కువగాఁ గలవు. ఇందలి సూత్రములు రెండు వేల యేఁడువందలకుఁ బైగాఁ గలవు. ఈ పండ్రెండధ్యాయ ములు గల పూర్వమీమాంసా శాస్త్రమంతకు, ధర్మము ప్రధాన విషయమని "అ[2]థాతో ధర్మజిజ్ఞాసా" అను మొదటి సూత్రమునుండి తెలియుచున్నది. పైనఁజెప్పఁబడిన రీతిని 'అధర్మమును' దెలిసి కొనుటకూడ నావశ్యక మగుచున్నది కనుక, 'అధర్మమును విడుచు టకై దాని స్వరూపమును దెలిసికొనవలయును' అనునదికూడ, మొదటిదగు "[3]అథాతో ధర్మజిజ్ఞాసా" అను సూత్రమునుండియె స్పష్టపడుచున్నది. ఇట్టిశాస్త్రమునందుఁ బ్రధానవిషయమైన ధర్మ మును సంబంధించు నితర విషయము లీక్రింద వివరింపఁబడు రీతిని పండ్రెం డధ్యాయములయందును వరుసగాఁ దెలుపఁబడుచున్నవి. మొదటి యధ్యాయమున ధర్మముయొక్క లక్షణమును, దానిని (ధర్మమును) సిద్ధింపఁజేయుట కుపయోగించు విధివాక్యములు, అర్థ వాదములు, మున్నగు ప్రమాణములును వివరింపఁబడుచున్నవి. రెండ

---

1 అధికరణము:—విషయము, సందేహము, సంగతి (సందర్భము,) పూర్వ పక్షము, సిద్ధాంతమునను నైదంశములను వివరించు వాక్యముల సమూహము.

2. వేదమును జదివినపిదప, అట్లు చదివినవాఁడే దానియందలి యర్థమును విమర్శించి తెలిసికొనఁదగుటవలన, వేదమునకు సారమైన ధర్మమును వివరముగాఁ దెలి సికొనవలెను.

3. 'అథ + అతః + అధర్మజిజ్ఞాసా.' పైని వివరింపఁబడిన రీతిని 'అధర్మ ముయొక్క స్వరూపమును దెలిసికొనవలెను' అనునది యీ సూత్రమువలననే స్పష్ట పడుచున్నది.

వయధ్యాయమునందుఁ వేదముచే విధింపఁబడు కర్మములయందలి పర స్పరభేదములు నిరూపింపఁబడుచున్నవి. మూఁడవ యధ్యాయము నందు ప్రయాజములు మున్నగు క్రియలను, దర్శపూర్ణమాసేష్టులు మున్నుఁ గాఁగలవాని కంగములుగా వినియోగింపఁజేయు "శ్రుతి," 'లింగము,' 'వాక్యము,' మొదలగు నాఱు ప్రమాణములు నిరూపింపఁ బడుచున్నవి. నాల్గవ యధ్యాయమునందు, ఆచరింపఁబడు క్రియలలో నేది దేనికొఱకు వాస్తవముగా నుద్దేశింపఁబడినదో యా వివరము స్పష్టమగును. ఐదవ అధ్యాయమునందు, కర్మముల నాచరించు క్రమ మును బోధించెడు 'శ్రుతి,' 'అర్థము,' 'పాఠము,' మున్నగు నాఱు ప్రమాణములు వివరింపఁబడును. ఆఱవ అధ్యాయమునందు, 'విహి తమైన కర్మమునుండి జనించుఫలము ననుభవింపఁదగి యుండుట, య నెడి 'అధికారము' వివరముగాఁ దెలుపఁబడును. ఏడవ అధ్యాయము నందు, [1]ప్రకృతులయందుపదేశింపఁబడిన యంగములను [2]నతిదేశము మూలముగా, వికృతులయందుఁ బ్రాప్తింపఁ జేయురీతి బోధింపఁబ డును. ఎనిమిదవ యధ్యాయమునందు, ప్రకృతియందలి స్పష్టలింగ ముల మూలముగాఁ గాని, అస్పష్టలింగముల మూలముగాఁ గాని, ప్రబలలింగముల మూలముగాఁ గాని చేయఁబడు నతిదేశవిశేషములు నిరూపింపఁబడును. తొమ్మిదవ యధ్యాయమునందు 'ప్రకృతులయం దలి యంగములను నతిదేశము మూలముగా వికృతులయందుఁ బ్రా

1. కర్మములలో, దేనికొఱకు నావశ్యకమగు నంగములన్నియు నుపదేశిం పఁబడునో యట్టికర్మము 'ప్రకృతి' యనియు, వీనిలోఁ గొన్ని యంగములు మాత్రమే కల మిగిలిన కర్మములు 'వికృతుల'నియును మీమాంసకుల వ్యవహారము కలదు. ఇష్టులలో దర్శపూర్ణమాసేష్టులను, యాగములలో జ్యోతిష్టోమయాగమును 'ప్రకృ తులు' అనఁబడుచున్నవి. మిగిలినవన్నియు వికృతులు.

2. అతిదేశము—ఏదోయొక కర్మము నాచరించిన రీతినే, దానివంటి మఱి యొక కర్మము నాచరించుట' అను న్యాయము.

ప్తింపఁజేయుటకై యీ యంగములయందు నావశ్యకములగు మార్పులను జేయుట ' యనెడి '[1] ఊహ ' వివరింపఁబడును. పదియవయధ్యాయమునందు, ప్రకృతినుండి యతిదేశము ద్వారమున వికృతియందుఁ బ్రాప్తింపఁజేయఁబడు నంగములు, వికృతియందుఁ బ్రత్యేకముగా నుపదేశింపఁబడిన యంగములచే[2] బాధింపఁబడు రీతి తెలుపఁబడును. పదునొకండవ యధ్యాయమునందనేక ప్రధానయాగముల కొఱకు విధింపఁబడిన యంగము లొక మాఱాచరింపఁబడిన మాత్రముననే, యా ప్రధానయాగము లన్నింటికి నుపకరించు ప్రకారము వివరింపఁబడును. పండ్రెండవ యధ్యాయమునందేదో యొక ప్రధానయాగముకొఱకుద్దేశింపఁబడిన యంగము నాచరింపఁగా, నీ యంగము నాచరింపఁజేయు సామర్థ్యము లేని మఱియొక ప్రధానయాగమునకుఁ గూడ నీ యంగమువలన జనించు నుపకారము సిద్ధించురీతి వివరింపఁబడును.

పూర్వమీమాంసామతము నందలి సిద్ధాంతము లీక్రింద వివరింపఁబడుచున్నవి. పురుషునిచే నాచరింపఁబడిన కర్మమునుండి 'అపూర్వము ' అను పేరుగల శక్తి విశేషము (అదృష్టము) పుట్టి, కొంతకాలమైన పిదప నా పురుషుఁడు కోరినఫలము నుత్పాదించును. కర్మములందు నర్పింపఁబడు దేవత, తన్నుద్దేశించి యుచ్చరింపఁబడు మంత్రమే స్వరూపము గాఁగలదిగాని, మఱి యేవిధమగు నాకారమును గలదికాదు. ఇంద్రియముల కగోచరమగు సుఖమేదియు లేదు. వేదమంతయు కర్మమునే బోధించుట మూలముగాఁ బ్రమాణమగుచున్నది. [3] వటబీజమువలె సంసారమనాదియైనది. కర్మముల నాచరించుటవలనఁ

1. దేవతపేరును మార్చుట, వచనమును మార్చుట, మొదలైనవి.
2. నిషేధింపఁబడు—నివర్తింపఁ జేయఁబడు.
3. వటబీజము:—మఱ్ఱిగింజ.

గలుగు మోక్షమనునది స్వర్గమనెడి సుఖమును బొందుటయే. ఏదేనొక క్రియను బోధించు వాక్యముననే ప్రవృత్తిని గలిగించు నర్థమును దెలియఁజేయు శక్తికలదు. పురుషునికిఁ గలుగుజ్ఞానమంతయు [1] ప్రమయే. అఖ్యాతివాద మంగీకరింపఁబడుచున్నది. ఆత్మ స్థూలశరీరముకంటె భిన్నుఁడు. అతఁడు నిత్యుఁడు.

పైని వివరింపఁబడిన విషయములను బ్రతిపాదించు పూర్వమీమాంసా శాస్త్రము, జైమిని మహర్షిచే సూత్రరూపముగా రచియింపఁబడినది. ఈ పండ్రెండధ్యాయములు గల శాస్త్రమేకాక, నాలుగేసిపాదములుగల నాలుగధ్యాయములు గలదియు, దేవతలనుగూర్చిన విషయములను బోధించునదియు, 'సంకర్ష కాండ' మను పేరుగలదియునగు వేఱొక శాస్త్రముకూడ, జైమినిచే సూత్రరూపముగా రచింపఁబడినదని తెలియుచున్నది. పాణిని గురువైన వర్షోపాధ్యాయుని సోదరుఁడగు 'ఉపవర్షు' నిచే నీ [3] జైమినీయమగు మీమాంసా సూత్రముల కొక '[4] వృత్తి' వ్రాయఁబడెను. పిమ్మట నీ సూత్రములకు శబరస్వామిచే [5] భాష్యము రచింపఁబడెను. జైమిని సూత్రములు [6] ఉపవర్షవృత్తి, శాబరభాష్యమునను నీ మూఁడును నీ పూర్వమీమాంసా శాస్త్రమునకు మూలగ్రంథములు. వీని నాధారముగాఁ

---

1. ప్రమ=యథార్థమైన జ్ఞానము. భ్రమ=అయథార్థజ్ఞానము.

2. అనిర్వచనీయఖ్యాతి, అన్యథాఖ్యాతి, అసత్ ఖ్యాతి, సత్ ఖ్యాతి. అఖ్యాతి, నను నైదువిధములగు ఖ్యాతులు దర్శనము (శాస్త్రముల) యందంగీకరింపఁబడుచున్నవి. ఖ్యాతి=తెలివి=తెలిసికొనుట.

3. జైమినీయము=జైమినిచే రచింపఁబడినది. 4. వృత్తి=సులభమైన టీక. 5. భాష్యము='శాబరభాష్యము' అనిపేరు. 6. ఉపవర్షునిచే వ్రాయఁబడిన వృత్తి.

గొనియే తరువాతి గ్రంథములన్నియు వ్రాయఁబడినవి. వీని వాత కుమారస్వామి యవతారమగు 'కుమారిలభట్టు'నిచే నీ భా మును వివరించు వార్తికములు రచియింపఁబడెను. వీనిలో మొ యధ్యాయమునందలి మొదటి పాదమును సంబంధించు వార్తిక లకు 'శ్లోకవార్తికము'నియు, రెండవపాదము మొదలు మూడవ ధ్యాయము తుదివఱకు నుండు భాగమును సంబంధించు వార్తిక లకు 'తంత్రవార్తికము'నియు, మిగిలిన భాగమంతను సంబంధి వార్తికములకు 'టుప్టీక' యనియుఁ బేళ్లుగలవు. ఈభాష్యము 'బృహతి' యను పేరుగలవ్యాఖ్యానము, కుమారిలభట్టుని శిష్యు చెప్పఁబడు 'ప్రభాకరు'నిచే రచియింపఁబడెను. కుమారిలభట్టు ష్యమును, ప్రభాకరుఁడు వృత్తిని, విశేషముగా ననుసరించిరి. వీ వురకును నీ శాస్త్రము విషయమై కొన్ని మతభేదము లుండుటం 'భాట్టమతము,' 'ప్రాభాకరమతము,' నని రెండు భిన్నమతము కలిగినవి. వీనిలో ప్రాభాకరమతము ననుసరించివ్రాయఁబడిన [1] థము లతిస్వల్ప సంఖ్యగలవని తెలియుచున్నది. భాట్టమతము ప్ర మగుటచే దాని ననుసరించియనేకగ్రంథములు కాలక్రమమున యఁబడినవి. 'టుప్టీక' కాక మిగిలిన వార్తికములకు, 'న్యాయసు' యను పేరుగల వ్యాఖ్యానము 'భట్టసోమేశ్వరు'నిచే రచింపఁబడె

---

1. (1) ప్రభాకరుని శిష్యుఁడగు శాలికానాథునిచే వ్రాయఁబడిన "ప్రకరణపంచిక (2) శాలికానాథునిచే వ్రాయఁబడిన "ఋజువిమల" యను పేరుగల వ్యాఖ్యా (3) 'నిబంధన' యను పేరుగల మఱియొక వ్యాఖ్యానము. ప్రాభాకరమతము చీన మీమాంసా సిద్ధాంతముల నంగీకరింపక వాని యందత్యంత భిన్నమార్గముల అంబించుటచే నీ మతము నందనాదరణము, దీనిని సమర్థించు ననేక గ్రంథములు లే దుటయును, సంభవించెనని తెలియుచున్నది.

ఈ వ్యాఖ్యానమునకే ‘ రాణకము ’ అను మఱియొక పేరుకలదు. ఈ రాణకమునకు ‘ రాణకోజ్జీవిని ’ యను వ్యాఖ్యానము ‘ అన్నంభట్టు ’ నిచే వ్రాయఁబడెను. పిమ్మట భాట్టమతమునే యనుసరించిన పార్థ సారథి మిశ్రుఁడు, ‘ తంత్రరత్నము, ’ ‘ శాస్త్రదీపిక, ’ ‘ న్యాయరత్న మాల, ’ ‘ న్యాయరత్నాకరము ’ నను నాలుగు గ్రంథములను రచించెను? వీనిలో ‘ తంత్రరత్నము, ’ టుప్టీకయను పేరుగల వార్తికములకు నొకవ్యాఖ్యానమై యున్నది. ‘ శాస్త్రదీపిక, ’ మీమాంసాసూత్రములకొక స్వతంత్రమైన వ్యాఖ్యానము. ‘ న్యాయరత్నమాల, ’ మీమాంసా శాస్త్రమును బోధించు నొక స్వతంత్రమైనప్రకరణము. ‘ న్యాయరత్నాకరము, ’ శ్లోకవార్తికమున కొక వ్యాఖ్యానము. ఈ పార్థసారథి మిశ్రుఁడు పదునొకండవ శతాబ్దమునకుఁ బూర్వుఁడు. ప్రాచీన మీమాంసా గ్రంథములకుఁ దరువాతి దగుమధ్య యుగము నందలి మీమాంసకులలో నితఁడు ప్రధానుఁడు. భాట్టమతముయొక్క ప్రాచీనస్వరూపమును, నిరూఢమైన యభిమానముతో వివరించిన వాఁడితఁడే. ఇట్టి మీమాంసామతము ప్రసరించు మధ్యమయుగము తుదిని, మీమాంసా శాస్త్రమును వివరించు కొందఱు వ్యాఖ్యానకర్తలుండిరి. వారిలో శంకరమిశ్రుఁడు ‘ శాస్త్రదీపిక ’కు, ‘ శాస్త్రదీపికా ప్రకాశము, ’ అను పేరుగల యొక వ్యాఖ్యానము రచించెను. ఇతఁడు, భాట్టమతము యొక్క ప్రాచీనస్వరూపమునకును, నవీనస్వరూపమునకును నడుమనుండు నవస్థను సూచించెను. పదునాల్గవ శతాబ్దమున, శ్రీ వీరబుక్క మహీపతి కమాత్యుఁడగు మాధవాచార్యుఁడు ‘ జైమినీయన్యాయమాలావిస్తర ’మను గ్రంథము రచించెను. ఇందు మీమాంసా శాస్త్రమునందలి యధికరణములన్నియు నధ్యాయక్రమ

మున వివరముగా నిరూపింపఁబడినవి. మఱియు, అప్పయదీక్షితుఁ
ప్రామాణికమైన మీమాంసా గ్రంథములను, వేదాంతగ్రంథముల
రచించిన వాఁడగుటచే, 'అద్వైతాచార్యుఁడ' నియు, 'మీమాం
సార్వభౌముఁ' డనియును బిలువఁబడుచున్నాఁడు. ఇతఁడు శాస్త్రదీ
కొక వ్యాఖ్యానమును, 'విధిరసాయనమ' ను నొక స్వతంత్రగ్రం
మును రచియించెను. ఇవిగాక కొన్ని వేదాంతగ్రంథములు కూ
నితఁడు వ్రాసెను.

పిమ్మట నీ మీమాంసాశాస్త్రము వ్యాపించు నవీనయు
మున కారంభము కలిగెను. ఈ యుగమునందలి మీమాంసకులలో
'ఖండదేవుఁడు' మిగుల ప్రసిద్ధిగాంచెను. ఇతఁడు పదునేడవశతా
మునందు 'భాట్టదీపిక,' 'భాట్టరహస్యము,' 'మీమాంసా కౌస్తు
భము,' నను మూఁడు గ్రంథములు రచించెను. ఈ మూఁడు గ్రం
ములను శ్రద్ధతోఁ జదివినవాఁడు మీమాంసా శాస్త్రముయొక్క ప్రా
నస్వరూపమును స్పష్టముగాఁ దెలిసికొనఁగలఁడు. ఖండదేవునకు
బిదపఁ గొందఱు మీమాంసా గ్రంథకర్తలుండిరి. వారిలో 'వేం
టాధ్వరి,' 'మీమాంసా మకరందమ' ను పేరుగల యొకగ్రంథమున
రచించెను. ఆపదేవుఁడు 'మీమాంసా న్యాయప్రకాశ' మను ప్రక
ణగ్రంథము మూలమునఁ బ్రాచీన భాట్టమతమును గూర్చిన 'పార్థ
సారథిమిశ్రుని' యభిప్రాయమును వెల్లడించెను. 'లౌగాక్షి భాస్క
రుని' చే వ్రాయఁబడిన 'అర్థసంగ్రహమ' ను ప్రకరణము ప్రాచీన
నవీనమతముల యందలి పరస్పరభేదములను నిరూపింపక, పూర్వమీ
మాంసా శాస్త్రవిషయములను సంక్షేపముగాఁ దెలుపును. కృష్ణయ

జ్వచే రచింపఁబడిన 'మీమాంసా పరిభాష' యను ప్రకరణము నవీనమతము ననుసరించియున్నది.

పూర్వమీమాంసా శాస్త్రమునందలి విషయములను న్యాయములను సవిస్తరముగా వివరించు నీ గ్రంథము లన్నియు సంస్కృతభాషలో శాస్త్రమున కావశ్యకమగు ప్రౌఢమైన శైలిని వ్రాయఁబడియున్నవి. ఇట్లు పూర్వమీమాంసా విషయములు లోకవ్యవహారమునందుఁ బ్రసిద్ధములు గాకపోవుటయే కాక, యీ గ్రంథములందలి భాషయు శైలియు నపరిచితములగుట వలన, 'పూర్వ మీమాంసా శాస్త్రము, సంస్కృతభాషాజ్ఞానము లేని యాంధ్రులకుఁ దెలియనశక్యముగా నున్నది. కావున నట్టివారలకుఁ బూర్వ మీమాంసా శాస్త్రవిషయములను సులభముగాఁ దెలుపుటకై, 'ఆంధ్రమీమాంసా పరిభాష,' 'ఆంధ్రమీమాంసార్థసారము,' 'ఆంధ్రమీమాంసా న్యాయదీపిక' అను నీ మూఁడు ప్రకరణగ్రంథములను నాంధ్రభాషలో సరళమైన శైలిని వ్రాసితిని. ఈ మూఁడు గ్రంథములను వరుసగాఁ జదివినవారికిఁ బూర్వ మీమాంసా శాస్త్రవిషయములు స్పష్టముగాఁ దెలియఁగలవు.

కూచిమంచి గోపాలకృష్ణమ్మ.

---

# విషయసూచిక

# ఆంధ్ర మీమాంసా పరిభాష

ఇఁకముందుఁ జెప్పఁబడఁబోవు పండ్రెండధ్యాయములుగల పూర్వ మీమాంసాశాస్త్రమునందు జైమినిమహర్షిచే 'ధర్మము', 'అధర్మము' అను రెండువిషయములు మాత్రమె యాచరణ కుపయుక్తము లగునట్లు వివరింపఁబడుచున్నవి. వానిలో ధర్మ మనునది వేదమునందు బోధింపఁబడిన [1]యిష్టసాధనత్వము గలది. ఉదాహరణము:—'యాగము', 'ఇష్టి', మొదలగునవి. అధర్మ మనునది వేదమునందు బోధింపఁబడిన [2]యనిష్టసాధనత్వము గలది. ఉదా:—ఎఱ్ఱియుల్లి భక్షించుట మున్నగునవి. అట్టి ధర్మాధర్మములను నిర్ణయించుటకు 'వేదము', 'స్మృతి', 'శిష్టాచారము' అను మూఁడు ప్రమాణములు గలవు. ఈమూఁటిలో వేదము స్వతంత్రమైన ప్రమాణము. వేదము ననుసరించినదగుటచే స్మృతికిఁ బ్రామాణ్యము సిద్ధించుచున్నది. వేదస్మృతులను రెండింటిని ననుసరించియే యుండుటచే శిష్టాచారమునకుఁ గూడఁ బ్రామాణ్యము సిద్ధించుచున్నది. వేదమునందు మంత్రములు బ్రాహ్మణములు నను రెండుభాగములు గలవు. అందు మంత్రములు ప్రయోగకాలమందుఁ జేయఁదగిన కృత్యములను స్మరింపఁజేయుట కుపయోగించునని ముందుఁ జెప్పఁబడును. ఇచటఁ బ్రయోగశబ్దమున కనుష్ఠానమని యర్థము. బ్రాహ్మణము లనఁగాఁ గర్మము మున్నగువానిని విధించువాక్యములు. బ్రాహ్మణములతో నేకాన్వయముగల వాక్యములకు 'అర్థవాదములు' అని పేరు. అర్థవాదములు విధింపఁబడువాని ప్రాశస్త్యము తెలుపుచు విధివాక్యములతో నేకాన్వయమును బొందుటవలనఁ బ్రమాణము లగుచున్నవి.

---

1. కోరినవస్తువును సంపాదించు స్వభావము. 2. హానికరమగుదానిని గలుగఁజేయు స్వభావము.

విధివాక్యము—(i) కర్మోత్పత్తివాక్యము. (ii) గుణవాక్యము. (iii) ఫలవాక్యము. (iv) ఫలవిశేషసంబంధమును బోధించు గుణవాక్యము. (v) సగుణకర్మోత్పత్తివాక్యమునున్నగు భేదములచేఁ బలువిధములుగా నున్నది. ఈవిధివాక్యప్రభేదములస్వరూప మిట్లు వివరింపఁబడుచున్నది. (i) ఏవాక్యముచే "ఈకర్మము చేయఁబడవలసినది" అని బోధింపఁబడుచున్నదో యట్టి వాక్యము 'కర్మోత్పత్తివాక్య' మనఁబడుచున్నది. ఉదా:—'అగ్నిహోత్రం జుహోతి' "(అగ్నిహోత్ర మనుపేరు గల హోమమును జేయుటచేఁ దన యిష్టమును సాధించునది.) ఈవిధివాక్యమం దగ్నిహోత్ర మనుపేరుగల హోమము చేయఁబడవలసినదిగా విధింపఁబడుచున్నది గనుక నిది కర్మోత్పత్తివాక్యము. (ii) ఏదేనొక కర్మోత్పత్తివాక్యమందు నొక కర్మము విహితమై యుండఁగా దాని కంగమగునట్లు ద్రవ్యము దేవత మున్నగు వానిని విధించువాక్యము 'గుణవాక్యము'. ఉదా:—'దధ్నా జుహోతి' ([1]దధి యనుద్రవ్యముచే హోమమును జేసి తన యిష్టమును సంపాదించునది.) ఈవాక్యమునందు [2]విహితపూర్వమగు హోమమున కంగముగా దధియను ద్రవ్యము విధింపఁబడుచున్నది. కాఁబట్టి యిది 'గుణవాక్యము'. ఇచట హోమమున కంగముగా విధింపఁబడుచున్నది కావున 'దధి' గుణమగుచున్నది. హోమము విధాయకమగు ప్రమాణాంతరముచేఁ దెలియఁబడినదై యిచట విధించు (దధి) ద్రవ్యముతో సంబంధించునట్లు నిర్దేశింపఁబడుచున్నది. కనుక నీవాక్యమందు హోమ 'ముద్దేశ్య' మగుచున్నది. విధాయకమగు ప్రమాణాంతరముచేఁ దెలియఁబడిన హోమమే యీవాక్యమందు మరల నిర్దేశింపబడుటచే '[3]అనువాద్య' మగుచున్నది. ఆహోమమే దధి

1. పెరుఁగు 2. ఇంతకుముందు వేఱొక విధివాక్యముచే విధింపఁబడిన
3. మరలఁ జెప్పఁబడినది.

మున్నగు గుణములతో సంబంధించుటచేఁ బ్రాధాన్యము నొందు చున్నది. హోమమునకువలె దధికిఁగూడ ముందు ధర్మములు సిద్ధించు చున్నవి. దధియను ద్రవ్యము ప్రమాణాంతరముచేఁ దెలియఁబడని దగుటచే దానికీ వాక్యమందే 'విధేయత్వము' సంభవించుచున్నది. ఇది (దధి) యే ప్రధానమైన హోమమునకు సాధనమగుటచే 'గుణ' మగుచున్నది. హోమముచేయుటకొఱకుఁ బురుషునిచే గ్రహింపఁ బడునదగుటవలన నాదధికి [1]ఉపాదేయత్వము కూడ సిద్ధించుచున్నది.

(iii) ఏదేనొక కర్మోత్పత్తి వాక్యమందు విధింపఁబడిన కర్మమునకు ఫలమేమని [2]యాకాంక్ష గలుగఁగా నాకర్మమున కొకానొక ఫలముతో సంబంధమును బోధించు వాక్యము ఫలవాక్యము. ఉదా:— "అగ్నిహోత్రం జుహుయాత్ స్వర్గకామః" (స్వర్గకాముఁ డగ్నిహోత్రమను హోమమును జేయవలయును.) ఇచట నెవఁడు స్వర్గమును గోరునో వాఁడు (అట్టి) స్వర్గప్రాప్తికి సాధనముగా నగ్నిహోత్రమను హోమమును జేయవలయునని, కర్మోత్పత్తివాక్యముచే విధింపఁ బడిన యగ్నిహోత్రహోమరూపమగు కర్మమునకు స్వర్గరూపమగు ఫలముతోఁ సంబంధము బోధింపఁబడుచున్నది గనుక నిది ఫలవాక్యము.

(iv) ఏవాక్యమునందుఁ బ్రమాణాంతరముచేఁ దెలియఁబడిన కర్మము నిర్దేశించి ఫలవిశేషసిద్ధికొఱ కొకానొక గుణము విధింపఁబడునో యది ఫలవిశేష సంబంధమును బోధించు గుణవాక్యము. ఉదా:— 'దధ్నేంద్రియకామస్యజుహుయాత్' (ఇంద్రియమును గోరువాఁడు దధియను సాధనముచే హోమమును జేయవలెను.) ఇచట 'హోమమునకు దధిని సాధనముగా నుపయోగించుటచేత నింద్రియరూపమగు ఫలమును సంపాదింపవలె' నని యగ్నిహోత్రహోమమును విధించు కర్మోత్పత్తి

---

1. గ్రహింపఁబడుట; మంత్రము నుచ్చరించుచుఁ జేతితోఁ దీసికొనఁబడుట.
2. తెలిసికొన నిచ్ఛ

వాక్యముచేఁ దెలియఁబడిన హోమము నుద్దేశించి యింద్రియరూప ఫలప్రాప్తికొఱకు 'దధి' గుణముగా విధింపఁబడుచున్నది. ఇదియే గుణఫలవిధి యనియు గుణకామవిధి యనియు వ్యవహరింపఁబడుచున్నది. (V) ఏవాక్యమునందు ద్రవ్యము దేవత మున్నగుగుణములును కర్మమును నొక్కమాత్రే విధింపఁబడునో యది సగుణకర్మోత్పత్తివాక్యము (కర్మమును గుణసహితముగానే విధించువాక్యము) ఉదా:— 'సోమేన యజేత' "సోమ(రస)ముచే యాగమును జేసి యిష్టమును త్పాదించుకొనవలయును" ఇచట యాగము సోమ (రస) సహితముగానే విధింపఁబడుచున్నది. సోమవిశిష్టమగు యాగమే విధింపఁబడుచున్నదైనను విశేషణమగు సోమమునకుఁ గూడ [1]నర్థాపత్తి ప్రమాణముచే విధానము సిద్ధించుచున్నది. ఒకానొకచోఁ గర్మోత్పత్తివాక్యమే ఫలసంబంధమునుగూడ బోధించునది యగుచున్నది. ఉదా:— 'ఉద్భిదా యజేత పశుకామః' (పశువులను గోరువాఁడు 'ఉద్భి'త్తను యాగముచేఁ దన యిష్టమును సంపాదింపవలయును). ఇచట నుద్భిత్తను పేరుగలయాగము మఱియొకవాక్యముచే విధింపఁబడనిదై పశుకామునిచేఁ బశుప్రాప్తికొఱకు నాచరింపఁబడవలసినదిగా నిచటనే విధింపఁబడుచున్నదిగాన నీయొకవాక్యమే ఫలవిశేషమునకు సాధనముగా నొకానొక కర్మమును విధించుచున్నది.

---

1. అర్థాపత్తి = ఏది లేనియెడల నేది సిద్ధింపదో యది దానిచే గ్రహింపఁజేయఁబడుచున్నది. ఉ॥ "దేవదత్తుఁడు బలిసియున్నాఁడు పగలు భుజింపఁడు" అనునది వినినతోడనే, దేవదత్తుఁడు రాత్రి భుజింపనియెడలఁ దాను బలిసియుండుట సిద్ధింపదుగాన నట్లు వాఁడు బలిసియుండుటవలన రాత్రి భుజించుచున్నాఁడు' అనునది గ్రహింపఁజేయబడుచున్నది. ఇట్లు గ్రహింపఁజేయునట్టి ప్రమాణమునకు 'అర్థాపత్తి' అని పేరు.

[1] ప్రకారాంతరముచే విధి 'ఉత్పత్తివిధి' 'వినియోగవిధి' 'ప్రయోగవిధి' 'అధికారవిధి' అని నాలుగువిధములు గలది. వానిలో ముఖ్యమైనదగు ప్రయోగవిధియొక్క స్వరూప మిట్లు నిరూపింపఁబడుచున్నది. ప్రయోగవిధి:—ప్రధానవిధియే యంగవిధులతో నేకాన్వయము నొందుటచే మహావాక్యమై సర్వాంగసహితమగు ప్రధాన ప్రయోగమును విధించునదగుటచేఁ బ్రయోగవిధి యని చెప్పఁబడుచున్నది. ఉదా:—[2] 'అగ్నిహోత్రం జుహుయాత్ స్వర్గకామః' (స్వర్గమును గోరువాఁ డగ్నిహోత్ర మను హోమమును జేయుటచేఁ దన యిష్టమైన స్వర్గమును సంపాదింపవలయును.) ఇచట 'నగ్నిహోత్రహోమముచే స్వర్గము నుత్పాదింపవలయు' నను నర్థము స్పష్టమగుచున్నది. ఇట్లుండ 'నీహోమముచే నెట్లు స్వర్గము నుత్పాదించుట?' యని [3]యితి కర్తవ్యతా [4]కాంక్ష గలుగును. ఎట్లన గొడ్డలిచే నొకకట్టను రెండుగాఁ జీల్పవలె నని చెప్పఁబడినపుడు దీనిచే నేరీతిగాఁ గట్టను జీల్పవలయును? అని యాకాంక్ష కలుగును. ఇట్లాకాంక్ష కలుగఁగా నీగొడ్డలిని బైకెత్తి సరిగాఁ గట్టమీఁద వేయుటచేఁ గట్టను జీల్పవచ్చునని లోకవ్యవహారమువలనఁ దెలియుచున్నది. అట్లే యిచటఁగూడ 'అగ్నిం ప్రణయతి' (అగ్నిని గార్హపత్యమునుండి యాహవనీయములోనికిఁ దీసికొనిపోవలయును) 'అగ్నిషు సమిధ ఆదధాతి' "అగ్నియందు సమిధల నుంచునది" మొదలగు నంగవిధులచే విధింపఁబడిన [5] అగ్నిప్రణయనము, [6]సమిదాధానము, స్థలశోధనము

1. మఱియొకరీతిగా

2. వి. వా. "అగ్నిహోత్రం జుహుయాత్ స్వర్గకామః"

3. ఇతి కర్తవ్యత, కథంభావము, ఇత్థంభావము=పనినిజేయు విధము

4. ఆకాంక్ష = తెలిసికొనుకోరిక

5. ప్రణయనము = గార్హపత్యమునుండి యాహవనీయములోనికిఁ దీసికొనిపోవుట. 6. ఆధానము = ఉంచుట.

మున్నగు సంగసముదాయమువలనజనించు [1]నుపకారముతోఁగూడిన యగ్నిహోత్రహోమముచే స్వర్గము నుత్పాదించునదియని ప్రధానమునకును సంగములకును గల పరస్పరాకాంక్షచేఁ గల్పింపఁబడిన మహావాక్యముచే స్వర్గరూపఫలసిద్ధికి సాధనముగాఁ బూర్వోక్తములగు సంగములన్నిటితోఁ గూడిన యగ్నిహోత్రము ప్రయోగించుట విధింపఁబడుచున్నది. కావున నిట్టిది ప్రయోగవిధి. ఇచట నిరూపింపఁబడిన యంగసముదాయమే యితికర్తవ్యత యని చెప్పఁబడుచున్నది. ఇందగ్నిహోత్రహోమము ప్రధానము. అగ్నిప్రణయనము మున్నగునవన్నియు సంగములు.

"శీఘ్రకాలములో నశించు కర్మములు చిరకాలమునకుఁ బిమ్మట స్వర్గాదిఫలముల నుత్పాదించుట యసంగతము కనుకఁ బ్రయోగవిధినిగూర్చి చెప్పఁబడినవిషయము సరిగాలేదు." అని, పూర్వపక్షులు చేయుశంక సరిగాలేదు. ఆయావిధినిషేధవాక్యముల వలన విహితనిషిద్ధకర్మములు బహుకాలమునకుఁ బిదప (మరణానంతరమున) నిష్టానిష్టములను సాధింపగలవని తెలియఁగాఁ, జేసినవెంటనే నశించుకర్మములకుఁ, గాలాంతరమునఁ గలుగఁబోవు ఫలములను గూర్చి కారణత్వము సిద్ధించుటకై, యీకర్మములకును గాలాంతరమున సిద్ధించుఫలములకును నడుమఁ బుణ్యపాపరూపమగు నపూర్వమనునది యొకటి కర్మజనితమై ఫలోత్పత్తిపర్యంతము యజమానుని యందుండునని మీమాంసకులచేఁ గల్పింపబడినది. కనుక యాగాది కర్మములు స్వజన్యమగు నపూర్వముమూలముగనే స్వర్గాదిఫలములను సాధింపఁగలవు గాని స్వతంత్రముగా సాధింపనేరవు. ఈయపూర్వమే "ఫలాపూర్వము," "పరమాపూర్వము" "పండాపూర్వము"నను నామములచే వ్యవహరింపఁబడుచున్నది.

1. ఉపకారము = అపూర్వము

ఇట్టి యపూర్వము ప్రాచ్యములు నుదీచ్యములు మున్నగు నంగములతోఁ గూడిన ప్రధానయాగమువలననే పుట్టును. ప్రధానయాగమాత్రమువలన నెన్నఁడును బుట్టనేరదు. ప్రధానయాగమాత్రమువలననే యపూర్వము పుట్టినచో ఫలముకూడ దానివలననే జన్మించును గాన నంగములను విధించుట వ్యర్థము కాఁగలదు. చేసినవెంటనే నశించు ప్రధానమునకు వేలు వేలు కాలములందుఁ జేయఁబడు నంగములతోఁ[1] గూడిక సంభవింపదు గాన సర్వాంగవిశిష్టమగు ప్రధానయాగమే ఫలాపూర్వమును సాధింపఁగలదనుట యసంగతమని శంకింపరాదు. ప్రధానకర్మమునకుఁ దన స్వరూపముతో నంగసాహిత్యము దుర్లభమైనను దనవలన జనించు 'నుత్పత్తి' యనెడు నపూర్వము మూలముగా నంగసాహిత్యము సులభమే యగును. ప్రధానకర్మమునకు నంగములతోఁ గూడిక సిద్ధించుటకుఁ, బ్రధానకర్మమునకును బరమాపూర్వమునకును మధ్యమున, బ్రధానకర్మమువలననే జనియించు నుత్పత్తియను పేరుగల యపూర్వమొకటి కలదని మీమాంసకు లంగీకరించుచున్నారు. ఇట్లే యంగములుకూడ నొకదానితో నొకటి కూడియే ప్రధానవాక్యమున కుపకరించునవగుటచేఁ, జేసిన వెంటనే నశించు నీయంగములకుఁ దమతమ స్వరూపములతో నన్యోన్యసాహిత్యము దుర్లభమైనను వానివాని (అంగముల) వలన జనించు నుత్పత్త్యపూర్వము మూలముగా నది సులభమే యగును. పరస్పరసహితములైన యంగములు ప్రధానమున కుపకరించుట యనఁగాఁ బ్రధానమునకు ఫలాపూర్వమును జనింపఁజేయు సామర్థ్యమును గలుగఁజేయుట.

దర్శపూర్ణమాసేష్టులయందు మఱియొక మీ చెప్పఁబోవు విశేషము గలదు. 'యదాగ్నేయోऽష్టాకపాలోऽమావాస్యాయాం

---

1. అంగములతోఁ గూడిక

పౌర్ణమాస్యాంచాచ్యుతో భవతి' [అమావాస్యయందును, పూర్ణిమ యందును నాగ్నేయమగు (అగ్ని దేవతకొఱకీయఁబడిన) [1]అష్టాకపాలపురోడాశ[2]మచ్యుత మగుచున్నది.] ఈవాక్యముచే నాగ్నేయయాగము విధింపఁబడుచున్నది. 'తాభ్యామేత మగ్నీషోమీయమేకాదశకపాలం పూర్ణమాసే ప్రాయచ్ఛత్' (అగ్నీషోములను జంటగా నుండు దేవతలకొఱ కుద్దేశింపఁబడిన యేకాదశకపాలమగు పురోడాశము పూర్ణిమయందా యిరువురు దేవతలకొఱకు నిచ్చెను.) అనువాక్యముచే నగ్నీషోమీయ యాగము విధింపఁబడుచున్నది. 'ఉపాంశుయాజమంతరాయజతి' [ఉపాంశువుగా(=మంత్రమును మెల్లగనుచ్చరించుచు) యజించుచున్నాఁడు] అను వాక్యమువలనఁ దెలియఁబడు నుపాంశుయాగము, 'తావబ్రూతా మగ్నీషోమావాజ్యస్యైవనావుపాంశుపౌర్ణమాస్యాం యజన్' "(అగ్నీషోములు పూర్ణిమయందు మాకిరువుర కును నాజ్యమును పాంశువుగా నిచ్చుచు అని పలికిరి.]" అను వాక్యమువలనఁ బూర్ణిమయందు విధింపఁబడినది. ఈమూఁడు యాగములును బూర్ణమాసేష్టియందుఁ [3]ప్రధానములు. ఈ యాగ్నేయము, అగ్నీషోమీయము' 'ఉపాంశుయాజము' అను మూఁడు యాగములకును వానివాని విధివాక్యములయందుఁ బౌర్ణమాసీకాలసంబంధముండుటంబట్టి 'య ఏవం విద్వాన్ పౌర్ణమాసీం యజతే' "(ఇట్లు తెలిసికొనిన యెవఁడు పౌర్ణమాసిని జేయునో") అను విద్వ[4]ద్వాక్యమునందు వినఁబడు నేకవచనాంతమగు పౌర్ణమాసియను పదముచేత నామూఁడు

---

1. ఎనిమిది ప్రమిదలయందు సంస్కారపూర్వకముగా వండఁబడినది.

2. నశింపనిది

3. ప్రధానయాగములు

4. విద్వద్వాక్యము=కర్మమును దెలిసికొనుటవలనఁ గలుగు మహిమను దెల్పు వాక్యము—

యాగముల సముదాయము గ్రహింపఁబడుచున్నది. కనుక వేదము నందెచ్చటెచటఁ బౌర్ణమాసి యనుపదము వినఁబడుచున్నదో యచ్చటచట నాగ్నేయము మున్నగు మూఁడుయాగముల సముదాయము గ్రహింపఁబడుచున్నది. "ఓయీ? 'అమావాస్యయందును' ఇత్యాది వాక్యమునందు యాగవాచకమగు పదము లేదుగనుక నా వాక్యము 'ఆగ్నేయ' యాగమును విధించుట యెట్లు?" అనిశంకింపఁ బనిలేదు. ఆవాక్యమునందలి యాగ్నేయపదము 'దీనికి నగ్ని దేవత' అను నర్థమునందు విధింపఁబడిన [1]'ఏయ' (ఢక్=ఏయ) ప్రత్యయ మంతమందుఁ గలది. అట్టి యాగ్నేయ పదమునకుఁ బురోడాశపద ముతోఁ [2]సామానాధికరణ్యముండుటవలన, నగ్నియను దేవతకును బురోడాశమను ద్రవ్యమునకును సంబంధమున్నట్లు విశదమగుచున్నది. అట్టిసంబంధము యాగము లేనిచో సంభవింపదు. ద్రవ్యదేవతా సంబంధము యాగముకాని యితర కర్మములందుండదుగాన యాగ క్రియయందే,యట్టి సంబంధము నియతముగానుండునని తెలియునది. దేవత నుద్దేశించిచేయు ద్రవ్యత్యాగమే యాగశబ్దమున కర్థమని మీమాంసకుల సిద్ధాంతము. కనుక నీవాక్యమునందు వినఁబడుచున్న ద్రవ్య దేవతాసంబంధముచే [3]నూహింపఁబడిన యాగము,వాక్యమునందు లేక పోవుటచేనధ్యాహృతమగు 'యజింపవలెను' అనుపదముచే విధింపఁబడు చున్నది."అగ్ని దేవత గాఁగలదియుఁ బురోడాశము ద్రవ్యము గాఁగలది యు నమావాస్య మున్నగు కాలములయందుఁ జేయఁబడవలసినదియు నగు యాగముచే నిష్టమును సంపాదించునది" అని యీవాక్యమునకు

---

1. "అగ్నేర్ఢక్" అను పాణిని సూత్రముచే విధింపఁబడిన ఢక్ ప్రత్యయ మునకు 'ఏయ' అను నాదేశము రాగా ఆగ్నేయ అనురూపము సిద్ధించుచున్నది—

2. సామానాధికరణ్యము=విశేషణవిశేష్యభావము.

3. ధూమమును జూచుటచే నగ్ని నూహించులాగున.

[1] శాబ్దబోధ కలుగుచున్నది. ఇట్లే యెచ్చటెచట ద్రవ్యదేవతల సంబంధము మాత్రమె వినఁబడుచున్నదో ‹ సౌర్యంచరుం నిర్వపేత్ › (సూర్యదేవతకిచ్చుటకొఱకుఁ [2] జరువును సముదాయమునుండి వేఱుపఱుపవలయును) ఈ మున్నగునట్టి వాక్యములయందు ద్రవ్యదేవతల సంబంధముచే నూహింపఁబడు యాగము విధింపఁబడుచున్నది యని చెప్పుటలో దోషములేదు. ‹ ఉపాంశుయాజము › ను దెలియఁజేయు వాక్యమందు ‹యజించు› ధాతువు వినఁబడుచున్నను దానికి విధిబోధకమగు ప్రత్యయమేదియు లేనందున నట్టివాక్య ముపాంశుయాజమును విధించుట యెట్లు? అని శంకింపరాదు. ‹ యజించుచున్నాడు › అనువర్తమానార్థకరూపమును ‹ యజించునది › అనివిధ్యర్థకరూపముగా మార్పు చేయుటవలన నావాక్యమునకు యాగవిధాయకత్వము సిద్ధించుచున్నది. ఇట్లే యెచ్చటెచట విధిని బోధించు క్రియారూపముండదో ‹ వ్రీహీన్ ప్రోక్షతి › [3] (వ్రీహులను బ్రోక్షించుచున్నాఁడు.) [4]‹సమిధో యజతి › మున్నగునట్టి వాక్యములయందిట్లే మార్పు చేయవలసియున్నది యని తెలియునది. ‹యజించుచున్నాఁడు› అను రూపము వేదమునందుమాత్రమె యుండు విధ్యర్థ[5]కమైన రూపముగాఁ బరిగణింపఁబడుటచే విధిని బోధించునని కొందఱిమతము.

అట్లే ‹ ఐంద్రందధ్యమావాస్యాయాం › (అమావాస్యయందిందు్రనికొఱకుద్దేశింపఁబడిన దధిచే యజించుచున్నాఁడు) ‹ ఐంద్రం పయోఽమావాస్యాయాం › (అమావాస్యయందింద్రునికొఱకుద్దేశింపఁబడిన పయస్సుచే యజించుచున్నాఁడు) అను రెండువాక్య

1. వాక్యార్థజ్ఞానము 2. అన్నము 3. ధాన్యము

4. సమిత్తనెడి దేవతకొఱకు యజించుటచేఁ దనయిష్టము నుత్పాదించుకొనవలయును.

5. లేట్ అను వైదవలకారము

ములచే విధింపఁబడు రెండు [1](సాన్నాయ్య) యాగములు 'యదాగ్నేయ,' ఇత్యాది పూర్వోక్తవాక్యముచే విధింపఁబడు నాగ్నేయ యాగము అను నీమూఁడు యాగములును నమావాస్యేష్టి (దర్శేష్టి) యందుఁ బ్రధానములు. ఈమూఁడుయాగముల సముదాయమును 'యఏవం విద్వా నమావాస్యాం యజతే' (ఇట్లు తెలిసికొనిన యెవఁడమావాస్యను జేయునో) అనువాక్యమునందలి ద్వితీయైకవచనాంతమగు 'అమవాస్యాం' అనుపదముచే గ్రహింపఁబడుచున్నది. కనుక నెచ్చటెచట దర్శశబ్దముగాని యమావాస్యాశబ్దముగాని వినఁబడుచున్నదో యచ్చటచట నాగ్నేయయాగము నైంద్రయాగములు రెండు నను నీమూఁడుయాగముల సముదాయము గ్రహింపఁబడుచున్నది. పూర్వోక్తములైన రెండు విద్వద్వాక్యములయందును నమావాస్యా పౌర్ణమాసీపదములు రెండింటిలో నొక్కొక్కదానిచే నొక్కొక్కయాగత్రయ మనువదింపఁబడుటకుఁ బ్రయోజన మేమనగా 'దర్శపూర్ణమాసాభ్యాం స్వర్గకామో యజేత' (స్వర్గమును గోరువాఁడు దర్శపూర్ణమాసల రెండింటిచేతను స్వర్గము నుత్పాదించునది) యనెడి విధివాక్యమందు 'దర్శపూర్ణమాసాభ్యాం' (దర్శపూర్ణమాసల రెండింటిచేతను) అను ద్వివచనాంతము సిద్ధించుటయే. అమావాస్యాపౌర్ణమాసీ పదములు రెండింటిలోను నొక్కొక దానిచే నొక్కొక యాగత్రయము గ్రహింపఁబడనియెడల వానిచే మొత్తముగా [2]నాఱుయాగములు గ్రహింపఁబడుటవలనఁ బ్రకృతమగు నీవిధివాక్యమునందు 'దర్శపూర్ణమాసాభ్యాం' (దర్శపూర్ణమాసల రెండింటిచే)నను ద్వివచనాంతమునకు బదులుగా దర్శపూర్ణమాసల యన్నిటి

1. సాన్నాయ్యము = దధిపయస్సులు

2. ఆగ్నేయయాగములు రెండు, సాన్నాయ్యయాగములు రెండు, అగ్నీషోమీయయాగము ఉపాంశుయాజము అనునవి యాఱు.

(ఆజిటి) చే నని బహువచనాంత ముండవలసియుండును. అనువదింపఁ బడుట యనఁగా బ్రమాణాంతరముచేఁ దెలియఁబడినదై మరల వినఁ బడుటయే. స్వర్గాదిఫలములను సిద్ధింపఁజేయు నాగ్నేయాది యాగ ముల యాజిటిసందర్భమునందును విహితములగుచున్న 'ప్రయాజము, ఆజ్యభాగము, అనూయాజము ' మున్నగునవి పైనుదాహరింపఁబడిన యాగ్నేయము మున్నగు నాఱుయాగములకును నంగములగుచున్నవి.

ఇట్లుండ 'దర్శపూర్ణమాసాభ్యాం స్వర్గకామో యజేత' (స్వర్గ మును గోరువాఁడు దర్శపూర్ణమాసలను రెండింటిచే స్వర్గము నుత్పా దించునది) అను విధివాక్యమునకు 'స్వర్గమును గోరువాఁ డొండొం టితోఁ గలిసినవియు, దర్శపూర్ణమాసశబ్దములచే గ్రహింపఁబడునవియు నగు యాగత్రయముల రెండింటిచే స్వర్గమును జనింపఁజేయునపూ ర్వమును త్పాదింపవలయును అని యర్థము. ఇచట రెండు వేఱువేఱు కాలములయందుఁ జేయఁబడు యాగత్రికములు రెండింటికిని గలయిక యెట్లని ప్రశ్నింపఁ బనిలేదు. యాగత్రికములు రెండింటికిని దమతమ స్వరూపముతోఁ బరస్పరసాహిత్యము దుర్లభమైనను నొక్కొక్క త్రిక మునుండి యపూర్వమొకటిజనియించునుగాన నాయపూర్వములమూల ముగా నాత్రికముల రెండింటికిని గలయిక సంభవింపఁగలదు. ఒక్కొక త్రికమునుండి యొకటియే సముదాయాపూర్వము జనియించుట యె ట్లని శంకింపరాదు. ప్రయాజములు, అనూయాజములు మున్నగు పూర్వోత్తరాంగముల సమూహముతోఁ గూడిన యొక్కొక్క త్రిక మునుండి సముదాయాపూర్వము జనియించు ప్రకారము వివరింపఁబడు చున్నది— ఒక్కొక త్రికమునకుఁ దన స్వరూపముతో సర్వాంగ సాహిత్యము సంభవింపదుగాన నొక్కొక త్రికమునందలి మూఁడు యాగములచే మూఁ డుత్పత్త్యపూర్వములుజనింప, వానిమూలముగా నన్నియంగములతోఁ గలయిక సిద్ధింపఁగలదు. అంగములగు ప్రయా

జాదులకుఁగూడఁ దమతమ స్వరూపములకుఁ బ్రధానముతో సాహి త్యము కుదురనిదైనను వానివానివలన జనించు [1]నుత్పత్త్యపూర్వముల ద్వారా నట్టిసాహిత్యము సంభవింపఁగలదు. కాఁగాఁ బ్రధానయాగ ములో యాతింటినుండి జనియించు నుత్పత్త్యపూర్వములకుఁ బ్రియా జాద్యంగములనుండి పుట్టు నుత్పత్త్యపూర్వములతోఁ గలయికయే, ప్రధానముల కంగములతోఁగలుగు సాహిత్యము. కనుకఁ బ్రయాజా ద్యంగములచే జనియించు నుత్పత్త్యపూర్వములతోఁ గూడిన పూర్ణ మాసేష్టియందలి యాగ్నేయము మున్నగు మూడుయాగములవలనను జనించు మూఁడపూర్వములచే సముదాయాపూర్వ మొకటి యుత్పన్న మగుచున్నది. అట్లే యంగములవలన జనించు నుత్పత్త్యపూర్వము లతోఁగూడిన దర్శేష్టియందలి యాగ్నేయము నైంద్రయాగములు రెండునను మూఁడు యాగములవలనను జనించు మూఁడపూర్వము లచే మఱియొకత్రికాపూర్వము గలుగుచున్నది. ఆగ్నేయము మున్నగు యాగత్రయముల రెండింటినుండియు జనియించిన నీత్రికాపూర్వముల రెండింటివలన, ఫలాపూర్వమను పేరుగల మహాపూర్వ మొకటి పుట్టు చున్నది. దానివలననే స్వర్గాదిఫలము సిద్ధించును.

కాఁగాఁ బ్రకృతమగు దర్శపూర్ణమాసవిధికి 'స్వర్గమును గోరు వాఁడు సర్వాంగములచే నుపకరింపఁబడు దర్శపూర్ణమాసేష్టుల రెం డింటిచేతను ఫలాపూర్వము మూలముగా స్వర్గము నుత్పాదింపవల యును'. అని యర్థము గనుక నట్టి ఫలాపూర్వమును జనింపజేయుట కొఱకు సర్వాంగములతోఁ గూడిన ప్రధానము నాచరింపవలయునని బోధించు విధియే ప్రయోగవిధియని యేర్పడుచున్నది.

ఇంతకుముందు విహితమగు కర్మము, గుణము, మున్నగువాని స్వరూపభేదమును బట్టి విధి కొన్నివిధములుగా విభజింపఁబడి సోదా

1. ఉత్పత్తియనెడి యపూర్వము.

హరణముగా నిరూపింపఁబడినది. ప్రస్తుతము విధిప్రవృత్తి (అనుష్ఠానము) వలనఁగలుగు ఫలభేదము ననుసరించి విధి (i) 'అపూర్వవిధి, (ii) నియమవిధి, (iii) పరిసంఖ్యావిధి.' అని మూఁడువిధములుగా విభజింపఁబడినది. వానిలో నేవిధి యంతకుముందుఁ దెలియఁబడని కర్మమును గర్తవ్యముగా బోధించునో యది యపూర్వవిధి యనఁబడును. ఉదా:—'వ్రీహీన్ ప్రోక్షతి' (వ్రీహులను బ్రోక్షింపవలయును) ఈవిధి దర్శపూర్ణమాససందర్భమునందు వినఁబడుచున్నది. ఈ విధి లేనియెడల దర్శపూర్ణమాసలకు సంబంధించిన వ్రీహులకుఁ బ్రోక్షణ మెట్లును లభింపనేరదు. ఈవిధియే యున్నయెడల దర్శపూర్ణమాసేష్టులకు సంబంధించిన వ్రీహులకుఁ బ్రోక్షణ మవశ్యము సిద్ధించుచున్నది. కనుక నింతకుముం దెంతమాత్రమును బ్రాప్తింపని ప్రోక్షణమును విధించుచున్నదగుటచే నిది యపూర్వవిధి యగుచున్నది—(ii) ఏవిధి యొకప్పుడు మాత్రమే ప్రాప్తించు కర్మము నెల్లపుడును జేయఁబడవలసినదానినిగా నియమించునో యదినియమవిధి యనఁబడుచున్నది. ఉదా:—'వ్రీహీనవహంతి' (వ్రీహులను దంపవలయును.) ఈవిధియు దర్శపూర్ణమాసేష్టుల సందర్భమునందే వినఁబడుచున్నది. ఈవిధి లేనియెడల దర్శపూర్ణమాసేష్టులకు సంబంధించు వ్రీహులకు, నాగ్నేయయాగమును విధించువాక్యమునందు వినఁబడు పురోడాశమున కుపయోగించు తండులముల సిద్ధి కనుకూలించునట్లుగా (వ్రీహుల) పొట్టును దీయుటకై దంచుట యను నుపాయ మెట్లు సిద్ధించునో యట్లే యొకప్పుడు గోళ్ళతోఁ జీల్చుటయను నుపాయముకూడ సంభవింపఁగలదు. ఇట్లు పొట్టుతీయుటయను కార్యము దంచుటకంటె వేఱుపాయముచేఁ గూడ సిద్ధింపఁగలదుగాన నీపక్షమునందు దంచుటయను నుపాయము సంభవింపకపోవచ్చును. కాఁబట్టి దంచుటయను నుపాయ మొకప్పుడుమాత్రమే ప్రాప్తించుచున్నది. ఈవిధి యున్నచో, నెప్పు

డును ‘దంచుటచేతనే వ్రీహుల పొట్టు తీసివేయఁబడవలయును.’ అను నియమము కలుగుటచేత, గోళ్లతోఁ జీల్చుటయను నుపాయ మెన్నఁడును సంభవింపకయే పోవును. కనుక ‘వ్రీహీ నవహంతి’ యనునది నియమవిధి యగుచున్నది. గోళ్ళు మున్నగువానితోఁ జీల్చుటవలనఁ గూడఁ బొట్టుతీయుట సంభవించును గాన ‘దంచుటచేతనే పొట్టుతీసి వేయఁబడవలెను’ అను నియమము వ్యర్థమని పలుకరాదు. దంచుట చేతఁ బొట్టుతీసిన యెడలనే కొంచె మదృష్టము జనియించుచున్నదని నియమాదృష్ట మొకటి యంగీకరింపఁబడుచున్నది. ఈనియమముచే దృష్టఫల మేమియు లేకున్నను నదృష్టమను ఫల ముండుటచేత నీ నియమము వ్యర్థము కానేరదు. ఆ నియామాదృష్టము (అపూర్వము) యాగోత్పత్త్యపూర్వమున కుపకరించి దానిమూలముగా ఫలాపూర్వ మునకుఁ గూడ నుపకరించు చున్నది. కనుక నీ నియమాపూర్వము లేనిచో ఫలాపూర్వమే జనింపదని యంగీకరించుటవలన నియమా పూర్వము వ్యర్థము కాఁజాలదు. ఇట్లే వ్రీహులు, సోమము, మున్నగు ద్రవ్యములకు సంబంధించు నియమవిధులయం దెల్ల నియమాపూర్వ మను ప్రయోజన ముండునని గ్రహింప వలయును—(iii) రెండు క్రియ లొకేచోటఁ బ్రాప్తించు చుండఁగా, వానిలో ననావశ్యకమగు దానిని నివర్తింపఁజేయుటయే ఫలముగాఁగల విధి పరిసంఖ్యావిధి యనఁ బడుచున్నది. ఉదా :—‘ఇమామగృభ్ణన్రశనామృతస్య త్యశ్వాభిధానీ మాదత్తే’ [అధ్వర్యుఁడు ‘ఈశనను (తాఁటిని) గ్రహించునది’ యను మంత్రముచే నశ్వరశనను గ్రహింపవలయును]. ఈవిధి చయన మను పేరుగల [1] వికృతియాగముయొక్క సందర్భమునందుఁ బై మంత్ర ము నశ్వరశనాగ్రహణమున కంగముగా విధించుచున్నది. ఈవిధియే

1. యాగములు ప్రకృతి, వికృతులు నని రెండువిధములుగ నున్నవి. అందు సోమయాగము ప్రకృతి. ఇతరయాగము లన్నియు వికృతులు. ఇట్లే ఇష్టులయందు దర్శపూర్ణమాసేష్టులు ప్రకృతులు. మిగిలినవి వికృతులు.

లేనియెడల నీమంత్రమునందు రశనాగ్రహణమను నర్థమును బ్రకాశింపఁజేయు సామర్థ్యమనెడు లింగప్రమాణముండుటవలన, నీమంత్రమశ్వరశనాగ్రహణమునందువలె [1]గర్దభరశనాగ్రహణమునందుఁగూడ నంగముగాఁ దప్పక ప్రాప్తింపఁగలదు. ఈవిధి యుండినయెడల 'నీమంత్రముచే నశ్వరశననే గ్రహింపవలయును. గర్దభరశన నీమంత్రము నుచ్చరింపక యూరకయే గ్రహించునది.' అని యర్థమేర్పడుటచే గర్దభరశనాగ్రహణమునం దీమంత్ర మంగముగా వినియోగింపఁ బడదు. కావున నొకమంత్రమునకే రెండింటియందు వినియోగము లొకేసారి ప్రాప్తించుచుండఁగా వానిలోన నపేక్షితమగు నొకదానిని నివర్తింపఁ జేయుటయే ఫలముగాఁగలదగుటచే నిది పరిసంఖ్యావిధి యగుచున్నది.

పూర్వము, 'ప్రయాజములు, అనూయాజములు' మున్నగునవి దర్శపూర్ణమాసేష్టుల కంగములని చెప్పఁబడినది. అచటఁ బ్రయాజాదుల నంగములుగా నిరూపించుటలో 1 శ్రుతి, 2 లింగము, 3 వాక్యము, 4 ప్రకరణము, 5 స్థానము, 6 సమాఖ్య యను నాఱుప్రమాణములు గలవు. వానిలో నొక్కొక్క ప్రమాణమును దాని వినియోగమును నీక్రిందఁ గ్రమముగా వివరింపఁబడుచున్నవి. అచట 'అగ్నిహోత్రం జుహోతి' అను నగ్నిహోత్రవిధాయకవాక్యముచే విహితమగు నగ్నిహోత్రమను హోమమును 'దధ్నా జుహోతి' (దధిచే హోమమును చేయవలయును) అను విధివాక్యమునందలి 'జుహోతి' (హోమము చేయవలయును) అనుపదముచే నుద్దేశించి దానికిఁ గరణము (సాధనము) గా దధి విధింపఁబడుచున్నది. ఇచట 'దధ్నా' అను పదమునందలి తృతీయావిభక్తి యనెడు శ్రుతి ప్రమాణముచేత, దధి యంగమని నిర్ణయింపఁబడుచున్నది. కావున నిచట శ్రుతి యను

1. చయనయాగమందు వేదిసమీపమున నశ్వరశనయనియు గర్ధభరశనయయు రెండు త్రాళ్లుండును.

ప్రమాణ మంగత్వమును నిరూపించుచున్నది— (2) లింగమనఁగా సామర్థ్యము. అది యర్థగతము శబ్దగతమునని రెండువిధములుగా నున్నది. వానిలో నర్థగతసామర్థ్యరూపమగు లింగమునకుదాహరణము:—స్రువేణావద్యతి ' ([1]స్రువముచే వేఱుపఱుపవలయును.) అను విధివాక్యమునుండి స్రువము దేనినైన వేఱుపఱచుటకంగము గాఁగల దని తెలియవచ్చుచున్నది. అయినను బురోడాశమువంటి ఘన ద్రవ్యములను స్రువముచే వేఱుపఱచుట యశక్యముగావ నాస్రువమందలి సామర్థ్యమను లింగప్రమాణమువలన స్రువ మాజ్యముసాన్నాయ్యము మొదలగు ద్రవద్రవ్యములను మాత్రమే వేఱుపఱచుట కంగముగాఁ గలదని యేర్పడుచున్నది. శబ్దగతమగు సామర్థ్యమను లింగమున కుదాహరణము:—శబ్దగతమగు లింగమనఁగా నర్థమును బ్రకాశింపఁజేయు సామర్థ్యము. "అగ్నయే జుష్టం నిర్వపామి" (అగ్ని దేవతకొఱకుఁ బ్రియమగు ద్రవ్యమును [2]నిర్వపించుచున్నాను.) అనుమంత్రమునకు [3]నిర్వాపమను క్రియను బ్రకాశింపఁజేయు సామర్థ్యము గలదు. అట్టి సామర్థ్యరూపమగు లింగముచే నీమంత్రము నిర్వాపక్రియ కంగమని నిర్ణయింపఁబడుచున్నది. ఏమంత్రమున కేక్రియను బ్రకాశింపఁజేయు సామర్థ్యముగలదో యట్టి క్రియ కామంత్ర మంగమగుచున్నది.
(3) వాక్యమను ప్రమాణము వివరింపఁబడుచున్నది. మంత్రమువ కన్వయోపకారకమగు పదాంతరముతోఁ గూడిక వాక్యమనఁబడును. ఉదా:—"ఇషే త్వా" (అను మంత్రము నుచ్చరించుచు 'మోదుగుకొమ్మను ఛేదించుచున్నాఁడు.') అనుమంత్రమునకు 'సాన్నాయ్యరూపమగు నాహారముకొఱకు నిన్ను' అని యర్థము. కావున నీ మంత్రమన్వయముకొఱకుఁ బదాంతరము నపేక్షించినదై 'ఛినత్తి'

1. స్రువమనఁగా మిళ్లివంటి యజ్ఞోపకరణము.
2. నిర్వపించు=వేఱుపఱచు. 3. నిర్వాపము=వేఱుపఱచుట.

(నఱుకవలెను) అనుపదముతోఁగూడి వాక్యమగుచున్నది. ఈ వాక్యముచే 'సాన్నాయ్యమగు నాహారముకొఱకు నిన్ను' అను మంత్రము నఱకుటయను క్రియ కంగముగా విధింపఁబడుచున్నది. దీనికే మఱియొక యుదాహరణ మొసఁగఁబడుచున్నది. "అగ్నయే జుష్టమ్" (అగ్నికొఱకుఁ బ్రియమైనదానిని) (వ్రీహిని) అనుమంత్రమునందలి 'అగ్నయే' 'జుష్టం' అనుపదములు 'నిర్వపామి' అను క్రియతో నేకవాక్యతను బొందుటవలన సంపూర్ణవాక్య మేర్పడుచున్నది. కావున నీ వాక్యముచే 'అగ్నయే జుష్టమ్' అను మంత్రము నిర్వాపక్రియ కంగముగా నిర్ణయింపఁబడుచున్నది. (4) ఒండొంటికిఁ గలుగు నాకాంక్షకుఁ బ్రకరణమని పేరు. ఉదా:— "దర్శపూర్ణమాసలను విధించు వాక్యమువలన స్వర్గమును గోరువాఁడు దర్శపూర్ణమాసేష్టులచే నిష్టము నుత్పాదింపవలెను" అని తెలియఁగా, 'దర్శపూర్ణమాసేష్టులచే నెట్టివిధముగా స్వర్గాపూర్వము నుత్పాదింపవలయును' అని యితికర్తవ్యతాకాంక్ష గలుగుచున్నది. అట్లేఫలమును గలుగఁజేయునవిగా విధింపఁబడిన యాగ్నేయాదులగు ప్రధానయాగముల సందర్భమునందు "[1]సమిధోయజతి" "తనూనపాతం యజతి" (తనూనపాత్తను నగ్ని నుద్దేశించి యజించునది) "ఆజ్యభాగౌయజతి" ([2]ఆజ్యభాగములను దేవతలకొఱకు యజించుటచేఁ దన యిష్టము నుత్పాదించుకొనవలయును). మొదలగు వాక్యములచే విధింపఁబడిన ప్రయాజాదులు ఫలరహితములై వినఁబడు చున్నవి. ఆ ప్రయాజాదులకు వానిని విధించువాక్యములయందు ఫలమేమియు వినఁబడకపోవుటవలన 'వీనికి ఫలమేమి' యని ఫలాకాంక్ష కలుగుచున్నది. కనుకఁ బ్రయా

---

1. సమిత్తులనెడి దేవతలకొఱకు యజించుటచేఁ దనయిష్టము నుత్పాదించకొనవలయును. 2. ఆజ్యభాగములను దేవతలకొఱకు యజించుటచేఁ దనయిష్టమున

జాదులకు ఫలాకాంక్షయు దర్శపూర్ణమాసలకుఁ గథంభావాకాంక్షయుఁ గలుగఁగా, వీనికి నొండొంటితోఁ గలుగు నాకాంక్షారూపమగు ప్రకరణమను ప్రమాణముచేఁ బ్రయాజాదులన్నియు దర్శపూర్ణమాసల కంగములని నిశ్చయింపఁబడుచున్నవి.— (5) స్థానమనఁగా సన్నిధి (సామీప్యము.) ఉదా:—"శుంధధ్వం" (శోధింపుఁడు) ఈ మొదలగు మంత్రము సాన్నాయ్యపాత్రవిధానమునకు సమీపమందుఁ బఠింపఁబడుచున్నది. కనుక సన్నిధియను స్థానప్రమాణముచేత, నీ మంత్రము సాన్నాయ్యపాత్రప్రోక్షణమున కంగముగా విధింపఁబడుచున్నది. (6) సమాఖ్యయనఁగా సంజ్ఞ (పేరు.) ఉదా:—అధ్వర్యు కాండమందుఁ బ్రతిపాదింపఁబడిన కర్మసమూహమునకు 'ఆధ్వర్యవము' అను సంజ్ఞగలదు. కనుక నీసంజ్ఞారూపమగు సమాఖ్యాప్రమాణము చేత నధ్వర్యుఁడీకర్మసముదాయమునకుఁ గర్తగా నంగమగుచున్నాఁడని నిశ్చయింపఁబడుచున్నది. అట్లే మఱొక యుదాహరణము:—"ఐంద్రాగ్నమేకాదశకపాలం నిర్వపేత్ ప్రజాకామః" (ఇంద్రాగ్నులను జంటదేవతలనొఱకు ద్దేశింపఁబడిన యేకాదశకపాలమను పురోడాశము నిచ్చుటచే నిష్టమును సాధించునది.) ఈమున్నగు వాక్యములచే విధింపఁబడినవియుఁ, గామ్యేష్టియను సంజ్ఞగలవియునగు నైంద్రాగ్నము మొదలుగాఁగల యాగములసందర్భమునందు "ఉభావామింద్రాగ్నీ" (ఓ యింద్రాగ్నులను జంటదేవతలారా! మీ యుభయులను హోమముచే నర్చించుటకుఁ బిలుచుచున్నాను.) ఈ మొదలగు మంత్రము పఠింపఁబడుచున్నది. ఐంద్రాగ్నాది యాగములకుఁ 'గామ్యేష్టియాజ్యాకాండము' అను సమాఖ్య (పేరు) గలుగుటవలన సమాఖ్యాప్రమాణముచేత నీ మంత్రమాయాగముల [1] యాజ్యావాక్యగా వినియోగింపఁబడుచున్నది.

---

1 ప్రతియిష్టియందును యాజ్యానువాక్యలు పురోఽనువాక్యలునను రెండు విధములగు మంత్రములు పఠింపఁబడుచున్నవి.

శ్రుతి, లింగ, వాక్య, ప్రకరణ, స్థాన, సమాఖ్యలను నాఱుప్రమాణములకు నొకేచోటఁ బ్రవృత్తి సంభవించినపుడీక్రమమునందలి పూర్వపూర్వమునకుఁ బ్రాబల్యము, నుత్తరోత్తరమునకు దౌర్బల్యమును గలుగుచున్నది. ఉదా:—"కదాచన స్తరీరసి" ('ఓయింద్రుఁడా! నీవు మాకెప్పుడును హానిచేయువాఁడవుకావు') "ఈమున్నగు నింద్రుని సంబంధించు ఋఙ్మంత్రముచే గార్హపత్యమును సేవింపవలయును." అనువిధి యగ్నిహోత్రహోమసందర్భమునందు వినఁబడుచున్నది. ఇచట నీ మంత్రమింద్రునిఁ బ్రకాశింపఁజేయు సామర్థ్యము కలదగుటవలన, నట్టి సామర్థ్యరూపమగు లింగముచే నింద్రోపస్థానమునందంగముకావలసియున్నది. ఇట్లుండఁగా [1]విధివాక్యమునందలి 'ఐంద్ర్యా' (ఇంద్రుని సంబంధించు ఋఙ్మంత్రముచే) అనుపదమునందలి తృతీయాశ్రుతిచేతను 'గార్హపత్యమ్' (గార్హపత్యమును) అనుపదమునందలి ద్వితీయాశ్రుతిచేతను, నీమంత్రము గార్హపత్యోపస్థానమునకే యంగముగా విధింపఁబడుటవలన, లింగప్రమాణముచే నీమంత్రము నింద్రోపస్థానమున కంగముగా వినియోగించుట బాధింప (నిషేధింపఁ) బడుచున్నది. శ్రుతిప్రమాణము స్వతంత్రముగానే, మంత్రమును వినియోగింపఁజేయఁగలదు. లింగప్రమాణముచే మంత్రమును వినియోగింపఁజేయు పక్షమునందు, లింగ [2]మింద్రప్రకాశనసామర్థ్యమునుబట్టి "ఇంద్రుని సంబంధించు మంత్రముచే నింద్రుని సేవింపవలయును" అనుశ్రుతిని గల్పించి, మంత్రము నింద్రోపస్థానమున కంగముగా వినియోగింపఁజేయుచున్నది, అని చెప్పవలసియున్నది. కాని యట్లుచటఁ జెప్పుటకు వీలులేదు. ఎచట శ్రుతిచే మంత్రమునకు వినియోగము లేదో "అగ్నయే జుష్టం నిర్వపామి" (అగ్నికొఱకుఁ బ్రీతమైనదానిని నిర్వపించుచున్నాను.) ఈ మున్నగు స్థలములయందు, మంత్ర

1 "ఐంద్ర్యాగార్హపత్యముపతిష్ఠతే" 2 ఇంద్రుని బోధించు.

మునకు నిర్వాపక్రియను ప్రకాశింపఁజేయు సామర్థ్య (లింగ) మును బట్టి శ్రుతినిగల్పించుటకుఁ బ్రతిబంధకమగు ప్రత్యక్షశ్రుతి లేకపోవుట వలన 'ఈ మంత్రముచే నిర్వాపక్రియను జేయవలయును' అను శ్రుతిని గల్పించుటమూలముగా లింగమిచట వినియోగింపఁజేయుచునేయున్నది. లింగము వాక్యమునను రెండుప్రమాణములకును నొకేచోటఁ బ్రవృత్తిసంభవించునపుడు వాక్యమును బాధించి లింగప్రమాణమే విని యోజకమగుచున్నది. ఉదా :— "నీ [1]కొఱకు సుఖకరమగు [2]సదనమును గల్పించుచున్నాను." "[3]దానియందుఁ గూర్చుండుము." ఇచట 'దానియందు' అనుపదము వెనుకవాక్యమునందలి యర్థము నపేక్షించునదగుటవలన వాక్యప్రమాణముచే నీ రెండువాక్యములును గలిసి యొకే మంత్రమని తెలియఁదగి యున్నది. లింగప్రమాణము ప్రవర్తించినచో నీ రెండువాక్యములును వేఱు వేఱు మంత్రములగుచున్నవి. మొదటివాక్యము సదనమును గల్పించుట యనుక్రియను బ్రకాశింపఁజేయు సామర్థ్య (లింగ) ము గలదగుటచేఁ బ్రత్యేక వినియోగముగల యొకమంత్రమగుచున్నది. ఇట్లే రెండవవాక్యము సా[4]దనమను క్రియను బ్రకాశింపఁజేయు సామర్థ్యము గలదగుటచేఁ బ్రత్యేక వినియోగముగల మఱియొక మంత్రమగుచున్నది. ఇచట వాక్యము కంటెఁ లింగము బలీయము గనుక, వాక్యమును [5]బాధించి లింగమే ప్రవర్తించినచో, "నీ కొఱకు..." ఈ మున్నగు మంత్రమునకు సదన కల్పనాంగత్వమును "దానియందు" నీ మున్నగు మంత్రమునకు సాదనాంగత్వమును నిర్ణయింపఁబడఁగలవు. "నీ కొఱకు..." ఈ మొదలగు మంత్రమునకు "దానియందు" నీ మున్నగు మంత్రముతో నేకవాక్యత్వమును బొందుటయనెడు బలముచే, నేదోయొకరీతిగా సాదన

(1) వి. వా. "స్యోనంతే సదనం కృణోమి." (2) సదనము=ఆసనము. (3) తస్మిన్ సీద. (4) కూర్చుండఁబెట్టుట. (5) నివర్తింపఁజేసి.

మనుక్రియను బ్రకాశింపఁజేయు సామర్థ్యమను లింగమును గల్పించి యాలింగముచే 'నీ యేకవాక్యమగు విశిష్ట (ఒకే) మంత్రముచే సాదనమును జేయవలయును' అను శ్రుతి కల్పింపఁబడవలసియున్నది. మొదటి మంత్రమునందు సదనకల్పనమును బ్రకాశింపఁజేయుట యను ప్రత్యక్షలింగముచేఁ గల్పింపఁబడిన, '"నీ కొఱకు" ఈ మున్నగుమంత్రముచే సదనమును గల్పింపవలెను' అను శ్రుతిచేత "నీ కొఱకు" అను మంత్రమునకు సదనకల్పనమునందంగముగా వినియోగమకలుగుచున్నది. కనుక మొదటిమంత్రమున కాకాంక్షయేమియు లేకపోవుటచేతను, వాక్యమువలనలింగమునుగల్పించి దానిమూలముగా శ్రుతిని గల్పించుటయం దాలస్యమధికమగుటచేతను, వాక్యప్రమాణముచేఁ జేయఁబడు శ్రుతికల్పన, లింగప్రమాణముచేఁ జేయఁబడు శ్రుతికల్పనవలన బాధితమగుచున్నది. కనుక లింగప్రమాణముచే వాక్యప్రమాణ మెప్పుడును బాధింపఁబడుచునేయుండును. ఇట్లేవాక్యముచే బ్రకరణమునకును, బ్రకరణముచేఁ గ్రమ (స్థాన)మునకును, గ్రమముచే సమాఖ్యకును, బాధకలుగునని తెలియఁదగును. ఇట్లుండుటవలన శ్రుతిచేలింగమునకే బాధగలుగును గాన వాక్యాదులకుఁగూడ తప్పక బాధ సంభవించుచునే యుండును. ఈ రీతిగా నంగత్వమును బోధించుశ్రుతి మున్నగు ప్రమాణము లాఱును వివరముగా నిరూపింపఁబడినవి—

ఈ యంగత్వమునకే [1]శేషత్వమనియుఁ బా[2]రార్థ్యమనియు నామాంతరములు గలవు. పారార్థ్యమనఁగాఁ బరములగు ప్రధానములనుద్దేశించి ప్రవృత్తుఁడైన యజమానుని కృతి (యత్నము)చే సాధింపఁబడుట. ఉదా:— ప్రయాజాదులు, దర్శపూర్ణమాసముల నుద్దేశించి

(1) ప్రధానములు శేషులనియు నంగములు శేషములనియు మీమాంసాశాస్త్రమునందు వ్యవహరింపబడును. (2) అంగములు, ప్రధానములకొఱకుపయోగించునవగుటవలనఁ బరార్థములగుచున్నవి. పరార్థములయొక్క— ధర్మము పారార్థ్యము. కావున నంగత్వమునకుఁ బారార్థ్యమని రూపాంతరము.

ప్రవృత్తుఁడగు యజమానుని యత్నముచే సాధింపఁబడునవగుటచేఁ, బరార్థములగుచున్నవి. కావునఁ బైనఁజెప్పఁబడిన పారార్థ్యలక్షణము ప్రయాజాదులందు సమన్వయించుచున్నది. దర్శపూర్ణమాసములు ప్రయాజాదులనుద్దేశించి, ప్రవృత్తుఁడగు యజమానుని యత్నముచే సాధింపఁబడునవి కాకపోవుటవలన వానియందీ లక్షణమున కతి[1]వ్యాప్తిరాదు. కేవల ప్రయాజాదులనుద్దేశించి యేయజమానుఁడును బ్రవర్తింపఁడుగదా!

ఆలింగములు "సన్నిపత్యోపకారకము''లనియు, "ఆరాదుపకారకము'' లనియు రెండువిధములుగనున్నవి. ఏలింగములు స్వయముగాఁ గాని [2]పరంపరాసంబంధముచేతఁగాని ద్రవ్యదేవతారూపమగు ప్రధానయాగశరీరమును త్పాదించి దానిమూలముగాఁ బ్రధానయాగోత్పత్త్యపూర్వమున కుపకరించుచున్నవో యవి సన్నిపత్యోపకారకములనఁబడుచున్నవి. ఉదా:- వ్రీహులు మున్నగు ద్రవ్యములు, వానిని సంబంధించు నవహననము ప్రోక్షణము మొదలగు క్రియలు, అగ్నిప్రభృతిదేవతలు, వానిని సంస్కరించు [3]యాజ్యానువాక్యలు [4]పురోనువాక్యలు మున్నగుమంత్రములు. ఇచటఁ బ్రోక్షణము మున్నగుక్రియలు వ్రీహులయం దతిశయమును, బుట్టించుటమూలముగాను, నవహననము మొదలగు క్రియలు వ్రీహులపొట్టును వదలించుట యాదిగాఁగల దృష్టప్రయోజనమును గలిగించుటమూలముగాను, వ్రీహ్యాదులు పిండిమూలముగాను యాగశరీరాంతర్గతమగు ద్రవ్యరూపమైన పురోడాశమును నిష్పాదించు (ఉత్పాదించు) చు, దానివలన ద్రవ్యరూ

1. అతివ్యాప్తి యనఁగా లక్షణమేదైన లక్ష్యమునందు సమన్వయించుచు లక్ష్యముకాని దానియందుఁగూడ సమన్వయించుటయే.

2. దూరపుసంబంధము 3. రెండవ సగభాగమున దేవతాలింగముగల ఋఙ్మంత్రము. 4. మొదటి సగభాగమున దేవతాలింగముగల ఋఙ్మంత్రము.

పమగుయాగశరీరమునకును నాయాగోత్పత్త్యపూర్వమునకును హేతువులగుచున్నవి. యాజ్యానువాక్యాది మంత్రము లగ్న్యాది దేవతల యందు సంస్కారమును బుట్టించుట మూలముగాను, నగ్ని మున్నగు దేవతలు స్వయముగాను, దేవతారూపమగు యాగశరీరము నుత్పాదించుచు నాయాగోత్పత్త్యపూర్వమునకుఁ గూడ హేతువులగుచున్నవి. ఏదేని దేవతనుద్దేశించిచేయు ద్రవ్యత్యాగమే యాగమనియు ద్రవ్యదేవతలు రెండే యాగశరీరమనియు మీమాంసకుల సిద్ధాంతము. ఈ సన్నిపత్యోపకారకములగు నంగములకే "సామవాయికము"లను మఱియొకనామము గలదు. యజమానుని యాత్మయందు స[1]మవాయసంబంధముతోనుండు నపూర్వమును బుట్టించు నంగములు "ఆరాదుపకారకములు." ఉదా:- "ప్రయాజములు" "ఆజ్యభాగములు" "అనూయాజములు" మున్నగునవి. ఇవి ద్రవ్యమందుఁగాని దేవతయందుఁగాని సంస్కారమును బుట్టింపక, యజమానుని యాత్మయందుండు నదృష్టమును జనింపఁజేయుటవలన నారాదుపకారకములని వ్యవహరింపఁబడుచున్నవి.

సామాన్యముగాఁ గర్మము "అర్థకర్మ" మనియు "గుణకర్మ" మనియు రెండువిధములు. వానిలో నాత్మయందుండు నపూర్వమును బుట్టించునది యర్థకర్మము. ఉదా:— అగ్నిహోత్రహోమము, దర్శపూర్ణమాసేష్టులు, ప్రయాజము మొదలగునవి. సంస్కారమును గలి

(1) ద్రవ్యగుణములకుఁ గాని, యవయవావయవులకుఁ గాని, యొండొంటితో గలుగు నిత్యసంబంధము సమవాయము. ఇది తర్కశాస్త్రమందుఁ బ్రసిద్ధమైనది— ఆరాత్=సమీపము, దూరము. ఇవి యాగశరీరమునకు సన్నిహితము లగుటచేతఁ అదృష్టోత్పాదనమూలముగా యజమానునకతి సన్నిహితము లగుటచేతను సాధనము లగుచున్నవి.

గించునది గుణకర్మము. అది [1]యుపయుక్తసంస్కారకమనియు [2]నుపయోక్ష్యమాణ సంస్కారకమనియు రెండువిధములుగ నున్నది. వీనిలో నుపయుక్తసంస్కారకమనుదానికిఁ బ్రతిపత్తి కర్మమని పేరు. ఏదో యొకరీతిగా నుపయోగింపఁబడినదై, యచటనచటఁ జెదరిపడియున్న దానిని విధింపఁబడినప్రదేశమందుఁ బడవేయుట ప్రతిపత్తికర్మమనఁ బడుచున్నది. ఉదా:—ఇడయను యజ్ఞపాత్రమునందు హోమము చేయఁగా మిగిలినదియు, 'ఇడ' యను పేరుగలదియునగు పురోడాశమును భక్షించుట; [3]కృష్ణవిషాణమును విహితప్రదేశమందుఁ బడవేయుట; [4]చతురవత్తహోమము మొదలగునవి. "ఓయీ! ఇడాభక్షణమనునది, ప్రధానయాగమందుపయుక్తమై చెదరిపడియున్న పురోడాశమను ద్రవ్యమును విహితప్రదేశమగు జఠరమునందుఁ బడవేయుటయేగనుక, నది ప్రతిపత్తికర్మమని చెప్పుట యుచితముగా నున్నది. హోమము యాగమునకు సమానకాలికమగుటచేతను, హోమముచే సంస్కరింపఁడు చతురవత్తమగు హావిస్సు యాగమునందుపయోగింపఁబడినది కాకపోవుటచేతను, చతురవత్తహోమమనునది యాగోపయుక్త ద్రవ్యమునకు సంస్కారమును గలిగించునది కాకపోవుటచేతను నట్టి హోమము ప్రతిపత్తియని చెప్పుట యెట్లు?" అని యొక [5]పూర్వపక్షి ప్రశ్నించినయెడల సమాధాన మిట్లు చెప్పఁదగును. ఏదోయొకరీతిగా నుపయోగింపఁబడిన దానియందు సంస్కారమును గలుగఁజేయు కర్మమే ప్రతిపత్తియని యంగీకరింపఁబడుచున్నది. కాని ప్రధానయాగము కొఱకుపయుక్తమైనదానియందుమాత్రమే సంస్కారమును జనింపఁ

---

(1) ఏదోయొకరీతిగా నుపయోగింపఁబడిన దానియందు సంస్కారమును గలిగించునది. (2) ఉపయోగింపఁబడఁబోవుదానియందు సంస్కారమును గలిగించునది. (3) యాగసమయమున నఖములతో గోఁకికొనుట నిషిద్ధముగానఁ గృష్ణవిషాణముచే గోఁకికొందురు. (4) చతురవత్తమగు హావిస్సును హోమము చేయుట. (5) శంకించువాఁడు; పూర్వపక్షము చేయువాఁడు.

జేయుకర్మమని వివక్షింపఁబడలేదు. అట్లు వివక్షించినచో యాగపశు[1]విశసనమైనతరువాత వప, హృదయము [2]మున్నగుభాగములను బైకితీయుకాలమునందే చేయఁబడురక్తమలములను దొలఁగించుటయనెడు కృత్యము యాగమునందే యుపయోగింపఁబడినద్రవ్యమును విసరివేయుటరూపమగునది కాకపోవుటవలనఁ, బ్రతిపత్తికర్మము కాకపోవలసియుండును. అట్లే కృష్ణవిషాణము యాగమున కంగమైన గోకికొనుటయను కర్మమునకుపయోగింపఁబడినదైనను, యాగమునందే ప్రత్యక్షముగా నుపయోగింపఁబడినది కాకపోవుటవలన, దానినివిసరివేయుట కూడఁ బ్రతిపత్తికర్మము కాకపోవలసియుండును. కనుక నేదోయొకరీతిగా నుపయోగింపఁబడుటమాత్రమే యుచటవివక్షింపఁబడుచున్నది. వప, హృదయము మొదలగుభాగములు తీయుటచే నుపయుక్తమైన పశువును సంబంధించు రక్తమలములు చెదరిపడియుండుటచేఁ బ్రతిపత్తియను సంస్కారమున పేక్షించుచున్నవి. ఇచటఁ బశు వేదోయొకరీతిగా నుపయుక్తమైనది గనుక దానినిసంబంధించు రక్తమలములకుఁ జేయఁబడు 'విసరివేయుట' యను కృత్యము నిరాక్షేపముగాఁ బ్రతిపత్తికర్మమని చెప్పఁదగియున్నది. ఇట్లే యేదోయొకరీతిగా నుపయోగింపఁబడిన ద్రవ్యముతో సంబంధము చతురవత్తహోమమునకుఁ గూడఁ గలదు. అది యీక్రింద వివరింపఁబడుచున్నది. ప్రతిపత్తి [3]ప్రధానోత్తరకాలము, ప్రధానసమకాలము, ప్రధానపూర్వకాలము, అని మూఁడువిధములుగానున్నది. వానిలో మొదటిదానికి 'ఇడాభక్షణము' మొదలగునదియుదాహరణము. రెండవదానికిఁ జతురవత్తహోమము

---

(1) ఛేదించుట. (2) హృదయము, జిహ్వా, వక్షము, కాలేయము, వృక్కములు (శ్రేష్ఠమాంసము) ఎడమచెయ్యి, ఉభయపార్శ్వములు, కుడిపిఱుఁదు, కుడిచెయ్యి, ఎడమపిఱుఁదు. (3) ప్రధానముకంటె నుత్తరమైనకాలము గలది. అనఁగాఁ బ్రధానము చేసి పిదపఁ జేయఁబడునది. ఇట్లే మిగిలిన రెండింటియందును నర్థమును గ్రహించునది—

మొదలగునదియుదాహరణము. అది యీక్రింద వివరింపఁబడుచున్నది "[1]ఒకమాఱు బర్హిస్సునుబఱుపవలెను." "[2]హవిస్సును రెండుమాఱులు గ్ర హించిబర్హిస్సునందుంచవలెను." "[3]దానియందొకమాఱభిఘరింపవలె ను" "[4]చతురవత్తమైన హవిస్సును హోమము చేయవలయును." అను నీ నాలుగువిధులును దర్శపూర్ణమాసేష్టుల సందర్భమునందు వినఁబడు చున్నవి. వీనిలోఁ జతురవత్తవాక్యమందు హోమము ననువదించి దా నికి సాధనముగాఁ జతురవత్తమగు ద్రవ్యము విధింపఁబడుట లేదు. ఏల యన, హోమము వాక్యాంతరముచేఁ బ్రాప్తించుటలేదుగనుక దాని ననువదించుట సంభవింపనేరదు. "అమావాస్యయందును" ఇత్యాదివిధి వాక్యముచే హోమము ప్రాప్తించుచునేయున్నదని శంకింపరాదు. ఆ వాక్యము యాగమునే విధించుచున్నదనుటచేత హోమమును విధించునది కానేరదు. అయినను యాగమునకును హోమమునకును నభేదమేగదా యని యూహింపరాదు. దేవతనుద్దేశించి ద్రవ్యత్యా గముచేయుటయే యాగశబ్దమున కర్థమనియుఁ బ్రక్షేపముతోఁగూ డినట్టియాగమే హోమశబ్దమున కర్థమనియు మీమాంసకుల సిద్ధాంతము. "అమావాస్యయందు"...ఇత్యాదివిధిచే యాగము ప్రాప్తించినను ప్రక్షేపమను నంశము ప్రాప్తించుటలేదు. కనుక నట్టి ప్రక్షేపవిశిష్టయాగరూపమగు హోమమునకుఁ బ్రాప్తియే లేనందున దాని ననువదించుట సంభవింపనేరదు. "ఒకమాఱు బర్హిస్సును బఱు పవలెను" ఈ మున్నగు మూఁడువిధులచే విధింపఁబడిన చతురవత్త

(1) "సకృదుపస్తృణాతి"; (2) "ద్విర్హవిషోఽవద్యతి" (3) "సకృదభిఘారయ తి."; (4) "చతురవత్తంజుహోతి." చతుర్ + అవత్తం; అవ + దా + త. ఇచట ధా తువునంత్యాకారమునకు లోపము రాఁగా—అవ + ద్ + త= అవత్తం.' అనిరూపము సిద్ధించుచున్నది—చతురవత్తము = దీనికి వెనుక మూఁడు విధులందును జెప్పఁబడిన రీతిగా నాలుగువిధములుగా సంప్రయుక్తమైనది అనియర్థము. (5) ప్రక్షేపము, అగ్నౌ కరణము=అగ్నియందు దేవతలనుద్దేశించి నేయి మున్నగు హవిస్సును వేల్చుట.

ద్రవ్యము నుద్దేశించి దానికి సంస్కారమగునట్లు ప్రక్షేపము "హోమముచేయవలయును" అనుపదముచే విధింపఁబడుచున్నది. ఆప్రక్షేపరూపమగు సంస్కారము ప్రతిపత్తిరూపకర్మమే యగుచున్నది. "అ[1]గ్నిదేవతకుఁ బ్రీతమైనదాని నభిఘరించుచున్నాను." అను నీమున్నగు దేవతోద్దేశమును దెలియఁజేయు వాక్యములవలన, యాగాంగమగు నగ్నిప్రభృతి దేవతలకొఱకుద్దిష్టమగుటచే నేదోయొక రీతిగా నుపయుక్తమగునట్లు తెలియవచ్చుచున్న పురోడాశము, ప్రతిపత్తి నపేక్షించుచున్నది. కనుక దేవతోద్దేశమునిమిత్తము రెండుమాఱులు గ్రహింపఁబడి బర్హిస్సునందుంపఁబడిన ద్రవ్యమునకుఁ జేయఁబడు ప్రక్షేపము (అగ్నిలో వేయుట) ప్రతిపత్తి కర్మమని చెప్పుట యుచితముగానే యున్నది. ఈ ప్రక్షేపమను సంస్కారము ప్రధాన సమకాలము. "ఒక [2]ఋత్విక్కుచే 'వషట్' అని పఠింపఁబడినతోడనే హోమముచేయవలెను." అను విధివలన 'వ[3]షట్కారము'న కుత్తరక్షణమునం దధ్వర్యునిచే హోమము చేయఁబడవలెను. ఆక్షణమందే యాగముగూడఁ దన్ను స్మరింపఁజేయుటకొఱకే యుద్దిష్టమైన వషట్కారముచే స్మరియింపఁజేయఁబడినదై, యజమానునిచేఁ జేయఁబడవలెను. కనుక యాగమునకును హోమమునకును [4]యౌగపద్యము సంభవించుచున్నది. ఈవిషయము సర్వప్రదానాధికరణమును బోధించువార్తికమునందు విశదీకరింపఁబడినది. ప్రధానపూర్వకాలమగు ప్రతిపత్తికి నుదాహరణములు:—(i) "మల[5]మును దీసివేయవలెను." అను విధిచే విధింపఁబడిన (i)[a] మలసంప్రవేధనము; (ii) "రక్తమును

---

1. "అగ్నయే జుష్టమభిఘారయామి." 2. వి. వా. "వషట్కృతే జుహోతి." 3. వషట్కారము=వషట్ అని పఠించుట. 4 యౌగపద్యము=ఏకకాలమందు జరుగుట. 5. వి. వా. శకృత్సం ప్రవిధ్యతి. (i)a సంప్రవేధనము=తీసి బయటఁ బడవేయుట.

దోలఁగింపవలెను" అనువిధిచే విహితమగు (ii)[a] రక్తనిరసనము:— ఈ విషయముగూడ, [1]"పశావనాలంభాల్లోహితశకృతోరకర్మత్వం" అను నధికరణ (న్యాయ)మునందు వివరింపఁబడినది.

ఉపయోక్ష్యమాణసంస్కారము గూడ ననేకవిధములుగా నున్నది. (1)స్వయముగావినియోగింపఁబడినదానికిఁ జేయుసంస్కారము (2)స్వయముగా వినియోగింపఁబడిన దానికేది యుపకరించునో దానికిఁ జేయు సంస్కారము. (3) వినియోగింపఁబడఁబోవుదానికిఁ జేయుసంస్కారము. వీనిలో మొదటిదుదాహరింపఁబడుచున్నది. "[2]వ్రీహు, లచే యజించునది." అనువిధివలన స్వయముగా వినియోగింపఁబడిన వ్రీహులుమున్నగువానికి "[3]వ్రీహులను దంచవలెను" అనువిధిచే [4]అవఘాతాదిరూపమగు సంస్కారము విధింపఁబడుచున్నది. రెండవ సంస్కార ముదాహరింపఁబడుచున్నది. [5]దోహమునకంగమగుటచే స్వయముగా వినియోగింపఁబడిన గోరూపద్రవ్యమున కుపకరించు [6]వత్సమునకు "[7]దూడను బట్టుకొనవలయును." అనువిధిచే [8]'నాలంభన'మను సంస్కారము విధింపఁబడుచున్నది. (3)మూఁడవసంస్కారము దాహరింపఁబడుచున్నది.

"[9]కాఁగిన పాలయందు దధి నుంచ్చవలెను," "ఆ[10]యా[2a]మిక్ష విశ్వదేవులకును, [2b]వాజినము వాజిదేవతలకును నిచ్చునది." అను నీ రెండువిధులును [11]వైశ్వదేవయాగప్రకరణమందు వినఁబడుచు

1. లోహితం నిరస్యతి. (ii)a నిరసనము=పాఱవేయుట. 2. "వ్రీహిభిర్యజేత." 3. వ్రీహీనవహన్తి. 4. అవఘాతము, అవహననము=దంచుట. 5. దోహము=(గోవును) పాలుపిదుకుట 6. వత్సము=దూడ 7. "వత్సమాలభేత." 8. ఆలంభనము=పట్టుకొనుట; తాఁకుట; 9. వి. వా. "తప్తేపయసి దధ్యానయతి." 10. "సావైశ్వదేవ్యామిక్షా వాజిభ్యోవాజినం" 11. ప్రకరణము=సందర్భము. 2a ఆమిక్ష=విఱిగిన పాలయందుండు ఘనపదార్థము. 2b వాజినము=దానియందలి నీరు.

న్నవి. ఈ రెండవవిధియందలి 'ఆ' యనుశబ్దము పూర్వవాక్యమందలి దానిని బరామర్శించును గనుక, 'ఆమిక్ష' యను ద్రవ్యము పూర్వవాక్యమందలివిధిచేనిష్పన్నమగుననియు,నట్టినిష్పత్తిమూలముగాఁ దప్తపయస్సు రెండవవిధియందలివైశ్వదేవయాగమునకంగమై వినియోగింపఁబడబోవునదనియుఁ దెలియవచ్చుచున్నది. ఇట్లు వినియోగింపఁబడబోవు తప్తపయస్సునకుఁ జేయఁబడు 'దధినుంచుట' యను సంస్కారము మూఁడవదాని కుదాహరణమగుచున్నది.

పశు[1]యాగమున కంగమగు పురోడాశయాగముచే నుద్దేశపూర్వకముగా సంస్కరింపఁబడు నగ్నిషోములను జంటదేవతలు, అంతకుమునుపు చేయఁబడిన వపాయాగమందుపయుక్తమైరి. ఈపురోడాశయాగమునకుఁ బిదపఁజేయఁబడఁబోవు హృదయాద్యంగయాగమునందు ఉపయోక్ష్యమాణము (ఉపయోగింపఁబడఁబోవునది) గూడనగుచున్నది. కనుక నీపురోడాశయాగము 'అగ్నిషోమదేవతల'నుగూర్చి 'యుపయుక్తసంస్కారము' 'ఉపయోక్ష్యమాణసంస్కారము'ను గూడ నగుచున్నది. యజమానునిచేఁ జేయఁబడు త్యాగమునుబట్టి యదృష్టమును జనింపఁజేయునది కూడనగుచున్నది. [2]స్విష్టకృద్యాగము ద్రవ్యవిషయమునను దేవతావిషయమునను నుపయుక్తసంస్కారమే ప్రయోజనము గాఁగలదగుచున్నది. త్యాగవిష

---

(1) పశుయాగమునందుఁ పశువిశసనమైనతోడనే వపమాత్రము తీసి దానితో నగ్నిషోమదేవతల నుద్దేశించి వపాయాగము మొదటఁజేయఁబడును. దీని పిదప నాదేవతనే యుద్దేశించి పురోడాశయాగము చేయఁబడును. తదనంతరము ఆదేవతనే యుద్దేశించి హృదయాద్యవయవములతో యాగముచేయఁబడును. దీనికే హృదయాద్యంగయాగమని పేరు.

(౨) స్విష్టకృద్యాగము-స్విష్టకృత్తను పేరుగల యగ్ని నుద్దేశించి చేయఁబడు యాగము- ఈయాగమునందలి ద్రవ్యమును దేవతయును యాగమునకుఁ బూర్వముద్దేశింపఁబడినవగుటచేత నుపయుక్తములగుచున్నవి.

యమున నదృష్టమును జనింపఁజేయునదికూడ నగుచున్నది. "[1]సూక్తవాకమంత్రపఠనపూర్వకముగాఁ జేయఁబడు [2]ప్రస్తరప్రహరణము నగ్నిప్రక్షేపముమూలముగా ద్రవ్యమును, నుద్దేశము మూలముగా దేవతలను సంస్కరించునదగుచున్నది. ఇచట ప్రస్తరరూపమగు ద్రవ్యముయాగమునందు హవిస్సును ధరించినదగుటచే నుపయుక్తమైనది. సూక్తవాకమంత్రముచే స్మరింపఁజేయఁ బడునవియుఁ బ్రస్తరప్రహరణమందుద్దేశింపఁబడునవియునగు దేవతలు ప్రధానయాగమునందుద్దిష్టములగుటచే నుపయుక్తములే యగుచున్నవి. కనుక నీప్రస్తరప్రహరణముకూడ ద్రవ్యవిషయమునను దేవతావిషయమునను నుపయుక్తసంస్కారమును గలుగఁజేయునదే యగుచున్నది. [3]ఉత్తమప్రయాజము పిదప జరుగఁబోవు ప్రధానయాగమునం దుద్దిష్టములగు నగ్నిప్రభృతి దేవతలనే సంస్కరించునదిగనుక, దేవతావిషయమున నుపయోక్ష్యమాణసంస్కారమగుచున్నది. త్యాగవిషయమున నదృష్టమును జనింపఁజేయునది కూడ నగుచున్నది. హృదయాద్యంగయాగములకుఁ బూర్వము చేయఁబడు వసాహోమముగూడ [4]వసా

(1) సూక్తవాకమంత్రము. (వి. వా. "సూక్తవాకేన ప్రస్తరం ప్రహరతి." "సూక్తవాకమను మంత్రమును బఠించుచుఁ బ్రస్తరము నగ్నిలో వేల్చవలెను." అనునది విధివాక్యము) ప్రధానయాగమం దుద్దిష్టములగు దేవతలనామములను స్మరియింపఁజేయు మంత్రమునకు 'సూక్తవాక' మని పేరు.

(2) యాగమం దుపయోగింపఁబడఁగా మిగిలిన దర్భల నొకటిగాఁజేర్చి కట్టిన కట్టకు 'ప్రస్తర' మని పేరు. యాగాంతమందు సూక్తవాకమంత్రమును బఠించుచు నీ ప్రస్తరము నగ్నిలో వేల్చవలెను. ప్రహరణ మనఁగా వేల్చుట' హోమముచేయుట యనిభావము (3) ప్రధానయాగమునకుఁబూర్వము, iii. "ఇడోయజతి" iv. "బర్హిర్యజతి" ii. "తనూనపాతం యజతి" i. సమిధోయజతి" ...v. "స్వాహాకారం యజతి" అను నీ యైదువిధులచేతను విధింపఁబడు నైదు ప్రయాజములును జేయఁబడును. దీనిలోఁ దుదిది 'యుత్తమప్రయాజ' మనఁబడును,

(4) కుంభిలో మిగిలిన నీరు.

విషయమునఁ బ్రతిపత్తియుఁ ద్యాగాంశమున నదృష్టమును గలిగించు నదియు నగుచున్నది. ఇటువంటి యుదాహరణము లనేకము లాయా సందర్భములయందూహింపఁబడవలసి యున్నవి— "ప్రతిపత్తికర్మ మనఁగా నుపయోక్ష్యమాణ సంస్కారముకంటె భిన్నమగు సంస్కారమును గలుగఁజేయు కర్మము. చతురవత్తద్రవ్యము హోమముచే భస్మము చేయఁబడినదగుటవలన హోమమునకుఁ బిదప నుపయోగింపఁబడఁదగి యుండుట యసంభవము. కనుకఁ జతురవత్తహోమము పయోక్ష్యమాణ సంస్కారమునకంటె భిన్నమగుటచే నిరాక్షేపముగాఁ బ్రతిపత్తికర్మమగుచున్నది" అని కొందఱ యభిప్రాయము.

ఇచట నీక్రింద వివరింపఁబడు విశేషము గలదు. అర్థకర్మము విహితమగునపుడు ద్రవ్యమునకంటెఁ గర్మమునకుఁ బ్రాధాన్యము గలదు. కర్మమునకంటె ద్రవ్యము గుణ(=అప్రధాన)మగుచున్నది. ఉదా॥ అగ్నిహోత్రహోమము మున్నగు కర్మములు విధింపఁబడునపుడు కర్మమునకంటె దధిమున్నగు ద్రవ్యములకు గుణత్వము సిద్ధించుచున్నది. గుణకర్మము విధింపఁబడునపుడు కర్మమునకంటె ద్రవ్యమునకుఁ బ్రాధాన్యము గలదు. ద్రవ్యమునకంటెఁ గర్మమునకు గుణత్వము గలదు. ఉదా:—"వ్రీహులను బ్రోక్షింపవలెను" అను విధియందు వ్రీహులకంటెఁ బ్రోక్షణ క్రియకు గుణత్వముగలదు. 'వ్రీహులను' అనుపదమందలి ద్వితీయావిభక్తిచే వ్రీహులు క్రియాసాధ్యములని తెలియఁబడుటవలన వానికి (వ్రీహులకు) ప్రాధాన్యమును బ్రోక్షణక్రియకు గుణత్వమును గలవు. ఈ హేతువుచేతనే "వ్రీహులను దంచవలెను" అను విధియందు ద్రవ్యమునకుఁ బ్రాధాన్యమును అవహననము క్రియకు గుణత్వమును సిద్ధించుచున్నవి.

---

(1) వి. వా "వ్రీహీన్ ప్రోక్షతి".

(2) "వ్రీహీనవహన్తి".

ప్రకారాంతరముచే గుణకర్మము 'ఉత్పత్తి' 'ఆప్తి' 'వికృతి' 'సంస్కృతి'యునని నాలుగు విధములుగ నున్నది. ఉత్పత్తి సంస్కారమున కుదాహరణము. [1] "అగ్నుల నుంచవలెను." అను విధిచే నాహవనీయము మున్నగు త్రేతాగ్నులు మంత్రవిశేషపూర్వకముగా విహితప్రదేశములయం దుంపఁబడుట మూలముగా నుత్పాదింపఁబడుచున్నవి. ఈకర్మమునకే 'ఆధానము' అని పేరు. కనుక నీయాధానము 'ఆహవనీయా'ద్యగ్నుల యుత్పత్తికి హేతువగు సంస్కారమును జనియింపఁజేయునదగుటచేత, 'నుత్పత్తి' సంస్కార మగుచున్నది. ఆప్తి సంస్కారమున కుదాహరణము:—"[2]స్వాధ్యాయ (వేద) మును జదువవలెను" అను విధిచే [3]నధ్యయనము మూలముగా వేదము పొందఁబడుచున్నది. కనుక నీవిధిచే విధింపఁబడిన యధ్యయనము 'ఆప్తి' సంస్కార మగుచున్నది. వికృతి సంస్కారమున కుదాహరణము:—"[4]వ్రీహులను దంపునది" అను విధిచే విధింపఁబడు నవహననము వ్రీహులయందు 'పొట్టు'ను దీయుటయను వికృతిని (మార్పును) గలిగించునదగుటచేత, 'వికృతి' సంస్కార మగుచున్నది. సంస్కృతి కుదాహరణము. [5]వ్రీహులను ప్రోక్షించునది" అను విధిచే విధింపఁబడు ప్రోక్షణము వ్రీహులయందు "అతిశయము" (అపూర్వము) అను సంస్కారమును గలిగించునదగుటచేత సంస్కృతియను గుణకర్మ మగుచున్నది. ఈనాల్గిటిలోను 'ఆధానము' 'అధ్యయనము' అనునవి

---

*(1) వి. వా. "అగ్నీనాదధీత"

(2) వి. వా. "స్వాధ్యాయోఽధ్యేతవ్యః"

(3) అధ్యయనము = శాస్త్రమునందుఁ జెప్పఁబడిన నియమములతో సంతజెప్పుకొనుటమూలమున గురువునొద్ద వేదము నభ్యసించుట

(4) వి. వా. "వ్రీహీనవహంతి"

(5) వి. వా. "వ్రీహీన్ ప్రోక్షతి."

[1]స్వతంత్రములగు గుణకర్మములే కాని క్రత్వంగములుకావు. 'ప్రోక్షణము' 'అవహననము' మున్నగునవన్నియును క్రతువున కంగములగు గుణకర్మములే కాని స్వతంత్రములు కావని తెలియనగును.

అర్థకర్మము—నిత్యము, నైమిత్తికము, కామ్యము అని మూఁడు విధములుగలది. [2]"జీవించుచున్నంతకాలమును నగ్నిహోత్రమను హోమమును జేయవలయును" "[3]సాయంకాలమునందు హోమమును జేయవలెను." "ప్రాతఃకాలమందు హోమమును జేయవలయును" అను విధివాక్యములచే, జీవించుచున్న పురుషునిచే సాయం ప్రాతః కాలములయందుఁ దప్పక జేయఁబడఁదగినవిగాఁ దెలియఁబడిన యగ్నిహోత్రహోమము మున్నగునవి నిత్యములు. [4]పథికృత్తను పేరుగల యగ్నికొఱకష్టాకపాలమగు పురోడాశమును వేఱుపఱచి యిచ్చునది." అను విధిచేఁ బథికృదిష్టి, [5] దర్శపూర్ణమాసలకతిపాతనిమిత్తము కలిగినచోఁ జేయఁబడవలసినదిగా, విధింపఁబడు చున్నది. కనుక నిది నైమిత్తికము. నిత్య నైమిత్తిక కర్మముల నాచరింపనిచోఁ [6]ప్రత్యవాయము గలదనియుఁ జేసినయెడల ఫలము మాత్రము లేదనియుఁ గొందఱ మతము. "నిత్యనైమిత్తికములగు కర్మములచేఁ బాపనివారణము చేయుచు" అను నీ మున్నగు వాక్యములచేఁ బ్రత్యవాయనివృత్తి యనెడు ఫలముగలదు. ఫలము గలిగించునవగుటచేత నీ రెండును గామ్యములే కావలసియుండునని శంకింప

(1) క్రతువు నిమిత్తమే కాక ప్రత్యేకముగాఁగూడఁ జేయఁబడునవి.

(2) "యావజ్జీవ మగ్నిహోత్రం జుహోతి".

(3) "సాయంజుహోతి" ప్రాతర్జుహోతి".

(4) వి. వా. "అగ్నయే పథికృతే పురోడాశ మష్టాకపాలం నిర్వపేత్".

(5) అతిపాతము, అతిపత్తి = దర్శపూర్ణమాసేష్టులకు విహితములగు దినములు (శుక్లపక్ష ప్రతిపత్తు—కృష్ణపక్ష ప్రతిపత్తు) ఏదేని నుపపత్తిచే దాఁటుట.

6. ప్రత్యవాయము=పాపము; హాని.

రాదు. "ఫలమునుగోరుచు నీకర్మల నాచరింపకపోవుటచేతను, వాని వాని విధివాక్యములందు ఫలమును గోరువానిని గూర్చి యాయాకర్మములకుఁ బ్రయోజనములగు ఫలములను సాధించునవిగా విధింపఁబడకపోవుటచేతను, నీనిత్యనైమిత్తికకర్మములు కామ్యములు కావు" అని యితరుల యభిప్రాయము—

కామ్యకర్మము, 'కేవలము నైహికఫలము నిచ్చునది', 'కేవల మాముష్మికఫలము నిచ్చునది,' 'ఉభయవిధమగు ఫలము నిచ్చునది' యని మూఁడు విధములుగ నున్నది. ఐహికఫలము నిచ్చు కామ్యకర్మమునకుదాహరణము:— ఆయాకాలములం దెండిపోవుచున్న పైరులను జీవింపఁజేయుటకు హేతువగు వర్షమును గోరువానిచే 'కారీరి' యను నిష్టి చేయఁబడుచున్నది— ముందుకాలమున వర్షమును గోరువానిచేఁ గాని, ముందుజన్మమునందు వర్షమును గోరువానిచేఁ గాని, యీ యిష్టి చేయఁబడుటలేదు. కేవల మాముష్మికఫలము నిచ్చుదాని కుదాహరణము:—స్వర్గము మొదలగు ఫలమునిచ్చు దర్శపూర్ణమాసేష్టులు మున్నగునవి. ఇచట స్వర్గాదిఫలము లిహలోకమం దనుభవించుటకు వీలులేనివి. కావున నీయిష్టులు మున్నగునవి కేవల మాముష్మికఫలములనే యిచ్చును. ఉభయఫలములను నిచ్చుదాని కుదాహరణము:—"ఐ[1]శ్వర్యమును గోరువాఁడు వాయుదేవతాకమగు శ్వేతపశువు నాలంభించుటచేఁ దన యిష్టమును సాధించునది" అను విధిచే విధింపఁబడు యాగము 'ఐహికము,' 'ఆముష్మికము' ను నగు నైశ్వర్యము నిచ్చునది గాన నుభయవిధములగు ఫలములను నిచ్చుచున్నది.—

ఇఁక ముందు విధివాక్య మెట్లు విధించునో యారీతి వివరింపఁబడుచున్నది. వేదమునందు "స్వర్గకామః యజేత" (=స్వర్గమును

1. వి. వా. "వాయవ్యం శ్వేతమాలభేత భూతికామః"

గోరువాఁడు యాగము ననుష్ఠించి తన యభీష్టమును సంపాదింపవలయును.) అనువిధివాక్య మొకటికలదు. ఇచట నుండు 'యజేత' యను క్రియాపదమునందు 'యజ్' అను ధాతువుపైనుండు [1]'త' అనుప్రత్యయమునకు 'ఆఖ్యాతత్వము, లిజ్త్వము' అనెడు రెండు ధర్మములు కలవు. వీనిలో నాఖ్యాతత్వమను ధర్మమన్ని లకారములయందును సాధారణముగాఁ గలదు. 'లిజ్' ప్రత్యయమీధర్మముమూలముగాఁ బురుష [2]ప్రవృత్తియనెడి [3]యర్థభావనను బోధించుచున్నది. ఆ యర్థభావన, దేనిని? దేనిచేత? ఎట్లు? అను మూఁడు విషయములు గలది. అది యెట్లన: 'యజేత' అను క్రియాపదమునందు, మొదట 'త' అను ప్రత్యయము 'భావింపవలయును లేక చేయవలయును' అను నర్థమును దెలియఁజేయుచున్నది. దీనికిఁ గారణ మేమనఁగా 'సుబంతములచే బోధింపఁబడు కారకముల కన్నిటికిని దిజంతముచేఁ దెలుపఁబడు క్రియతోనే యన్వయ ముండవలె' నను నియమముచేత సుబంతతిజంతార్థములలోఁ దిజంతార్థము ప్రధానమగుటయే. తిజంతార్థమునందుఁ గూడఁ బ్రకృతియైన ధాతువుయొక్క యర్థముకంటెఁ బ్రత్యయములగు తిజాదుల యర్థమే ప్రధానమగుచున్నది గాన ముందుఁ బ్రత్యయమున కర్థమగు భావనయే మనస్సునకు గోచరమగుట యుక్తమగుచున్నది. అటుపయిని 'చేయవలయును' అను నర్థము నిచ్చు 'భావింపవలయును' అనెడు క్రియ సకర్మకమగుటచే 'దేనిని భావింపవలెను' అను కర్మాకాంక్ష కలుగఁగా, 'యజేత' అను పదముకంటె వేఱగు స్వర్గపదముచే గ్రహింపఁబడినదైనను స్వర్గము [4]భావ్యముగా

1. ఇది సంస్కృతమునందు 'విధిలిజ్' అనియుఁ దెనుఁగునందు లూట్టనియు వ్యవహరింపఁబడుచున్నది—

(2) పురుషప్రవృత్తి=పురుషుఁ డొకఫలము నపేక్షించి దానిని సాధించు నొక పనియందుఁ బ్రవర్తించుట. (3) అర్థభావన=ఒకానొక ప్రయోజనము నపేక్షించు పురుషుని నా ప్రయోజనమును సాధించు పనియందుఁ బ్రవర్తించునట్లు చేయు ప్రేరణ.

నన్వయించుచున్నది. దుఃఖరూపమగు యాగము కర్తకు [1]నీప్సితతమము కాకపోవుటచేఁ గర్మగా నన్వయింపనేరదు. స్వర్గమన్ననో యానందమయమగుటచేఁ గర్తకు నీప్సితతమమై కర్మగా నన్వయింపఁదగును. కనుక 'స్వర్గమును భావింపవలెను' అని యర్థ మేర్పడుచున్నది. పిమ్మట 'దేనిచేత' అని [2]కరణాకాంక్ష కలుగఁగా, 'త' ప్రత్యయమున్న 'యజేత' అను పదమందలి 'యజ్' ధాతువున కర్థమగు యాగము కరణముగా నన్వయించుటచే "స్వర్గకాముఁడు యాగమను సాధనముచే స్వర్గమును భావింపఁవలయును (ఉత్పాదింపవలయును.)" అని యర్థము సిద్ధించుచున్నది. పిదప 'యాగముచే నెట్లు స్వర్గమునుత్పాదింపవలయును' అను కథంభావాకాంక్ష కలుగఁగా, "స్వర్గకాముఁడు, అగ్న్యన్వాధానము, అవహననము మున్నగువానిచేఁ గలుగు [3]దృష్టోపకారముతోను, ప్రయాజములు మొదలగువానిచేఁ గలుగు [4]నదృష్టోపకారముతోను గూడిన యాగముచే స్వర్గమునుత్పాదింపవలయును" అను సంపూర్ణార్థ మీవిధివాక్యముచే బోధింపఁబడుచున్నది గాన, నగ్న్యన్వాధానము, ప్రయాజములు మున్నగు నంగముల సమూహమితికర్తవ్యతగా నన్వయించుచున్నది—

కథంభావాకాంక్షను బూరించుటయే యితికర్తవ్యత యనఁబడుచున్నది. ఎట్లన:—"ఓదనకామః పచేత్" (=ఓదనమును గోరువాఁడు పాకముచే నిష్టమును సాధించునది.) అను లౌకికవిధివాక్యమందు 'పచేత్' అనెడి క్రియారూపమునందలి 'త్' అనెడు 'లిఙ్' ప్రత్యయముచేత భావన బోధింపఁబడుచున్నది. ఇచట 'దేనిని భావింపవలెను?' అని భావ్యాకాంక్ష కలుగఁగా 'ఓదన' శబ్దార్థమగు

1 ఈప్సితతమము=మిక్కిలి కోరఁదగినది. 2 కరణము=సాధనము. 3 దృష్టోపకారము=ప్రత్యక్షముగాఁ గనుపడు నుపకారము. 4 అదృష్టోపకారము=ప్రత్యక్షముగాఁ గనఁబడని సంస్కారరూపమగు నుపకారము.

నన్నము భావ్యముగా నన్వయించుచున్నది. 'దేనిచేతను' అని కరణాకాంక్ష కలుగఁగా 'పచ్' అను ధాతువున కర్థమగు పాకము కరణముగా నన్వయించును. పిమ్మట 'ఎట్లు' అని ప్రకారాకాంక్ష కలుగఁగా 'గడ్డి నంటించి యూదుట మున్నగువానితోఁ గూడిన పాకముచేతను' అని తెలియవచ్చుచున్నది. కాఁగా "ఓదనకామః పచేత్" అను లౌకికవిధివాక్యమునుండి "ఓదనమును గోరువాఁడు గడ్డియంటించి యూదుట మున్నగువానితోఁ గూడిన పాకముచే నోదన ముత్పాదింపవలయును" అనెడు సంపూర్ణార్థము లభించుచున్నది. అట్లే వేదమునందుఁగూడ విధివాక్యములనుండి సంపూర్ణార్థమును గ్రహించునది.—

'యజేత' అను క్రియాపదమునందలి 'త' ప్రత్యయము లిఙ్త్వ మనెడి ధర్మముమూలముగాఁ బ్రేరణారూపమగు శబ్దభావనను బోధించుచున్నది. లోకమునందుఁ గూడ "గాం ఆనయ" (=గోవును దీసికొనిరమ్ము) అను గురువాక్యమును వినినవెంటనే, శిష్యుఁడు, "గురువు నన్ను గోవును దీసికొనివచ్చుటకై ప్రేరేపించుచున్నాఁడు" అని గురువుయొక్క ప్రేరణారూపమగు వ్యాపారమును దెలిసికొనియే గోవును దీసికొనివచ్చుటకుద్యుక్తుఁ డగుచున్నాఁడు. కనుక [1]అన్వయవ్యతి[2]రేకములచేఁ బ్రేరణాజ్ఞానము పురుషప్రవృత్తికిఁ గారణమగుచున్నది—ఇట్లు ప్రేరణాజ్ఞాన మన్వయవ్యతిరేకములచేఁ 'లిఙ్', 'లోట్', 'తవ్య' ప్రత్యయములను వినుటవలనఁ గలుగుచున్నది కావున లిఙాది

---

(1) 'ఒకటి యున్నపుడే రెండవది యుండును.' అనునది అన్వయము. ఉ:—మృత్తు ఉన్నచో ఘటము కలుగును. (2) ఒకటి లేనిచో రెండవదియు నుండదు' అనునది వ్యతిరేకము. ఉ:—మృత్తు ఉండనిచో ఘటము కలుగదు. అట్లే యిచటఁ బ్రేరణాజ్ఞాన మున్నచోఁ బురుషప్రవృత్తి కలుగును. అది లేనియెడలఁ బ్రవృత్తి కలుగదు. ఇట్టి సంబంధమే యన్వయవ్యతిరేకము అనఁబడుచున్నది.

ప్రత్యయములకుఁ బ్రేరణయందు శక్తి కలదని లోకమునందు గ్రహింపఁ బడుచున్నది. ఇట్లే వేదమునందుఁ గూడ లిఙాది ప్రత్యయములకుఁ బ్రేరణయందే శక్తిని గల్పించుట యుచితము. కాని యీమాత్రము భేదము కలదు. లోకమందు గోవును దీసికొనివచ్చుట మున్నగు పనుల యందుఁ బురుషప్రవృత్తిని గలిగించు ప్రేరణారూపమగు వ్యాపార మా వాక్యమును బ్రయోగించు పురుషునియందుఁ గల యొకవిధమగు నభి ప్రాయము. వేదమునందన్ననో ప్రేరణాబోధకమగు వాక్యమును బ్రయోగించు పురుషుఁడు లేనందున, నట్టి ప్రేరణయను వ్యాపారము లిఙాది ప్రత్యయరూపమగు శబ్దములయందే యుండునని మీమాంస కులచే నంగీకరింపఁబడుచున్నది. ఇట్లు ప్రేరణారూపమగు భావన శబ్ద మందేయుండు వ్యాపారమగుటచే శాబ్దభావనయని వ్యవహరింపఁబడు చున్నది. ఈ భావన, యాగము, హోమము మొదలుగాఁగల పనుల యందుఁ బురుషప్రవృత్తిని గలిగించునది కావున, దీనికే 'ప్రవర్తన' అనియు 'ప్రేరణ' అనియు నామాంతరములు గలవు.

ఈ శబ్దభావనయందుఁ గూడ 'భావ్యము' 'కరణము' 'ఇతికర్త వ్యత' అను మూఁడంశములు గలవు. ఇచటఁ బురుషప్రవృత్తియను నర్థభావన భావ్యముగా నన్వయించును. వేదాధ్యయనముచేఁ దెలియఁ బడు లిఙాది ప్రత్యయముల యర్థజ్ఞానము కరణముగా నన్వయించును. అర్థవాదములయందు బోధింపఁబడు ప్రాశస్త్యమును దెలిసికొనుట యి తికర్తవ్యతగా నన్వయించును. కాఁగా [1]"సాంగముగా వేదమును జది వినవారు తాము చదివిన వ్యాకరణము, నిగమము, నిరుక్తము మున్న గు శాస్త్రములచే విశేషపాండిత్యము సంపాదించినవారై, యధ్యయ నముచే గ్రహింపఁబడిన వేదమందుఁగల లిఙాది ప్రత్యయముల మూల ముగాను, అర్థవాదములచే బోధింపఁబడు ప్రాశస్త్యమును దెలిసికొ

1 సాంగముగా=అంగములతోఁగూడ.

నుట మూలముగాను, యాగాది కర్మములను గ_ర్తవ్యములనుగాఁ దెలిసికొని, వాని నాచరింపవలయును.'' అను శబ్దభావనారూపమగుసంపూర్ణార్థము విధివాక్యమువలన బోధింపఁబడుచున్నది. కావునఁ బురుషప్రవృ_త్తి శబ్దభావనయందు నిరాతంకముగా భావ్యమగుచున్నది. ఈ శబ్దభావన, జ్యోతిష్టోమము మున్నగు యాగవిశేషములను విధించు వాక్యములందు, 'యజేత' పదమందలి 'త' ప్రత్యయమందు 'లి_ఙ్త్వ' మనెడి ధర్మముమూలముగా, [1] స్వరూపమాత్రముచేఁ దెలియఁబడుచున్నదైనను, గ_ర్తవ్య మగునట్లు తెలియఁబడదు. జ్యోతిష్టోమాది విధాయకవాక్యములం దర్థభావనయే క_ర్తవ్యముగాఁ దెలియఁబడుచుండుటచే శబ్దభావన స్వరూపమాత్రముచేతనే తెలియఁబడునని చెప్పఁబడినది. కాని యాశబ్దభావన "స్వాధ్యాయోఽధ్యేతవ్యః" అను వాక్యమునందు మాత్రమే క_ర్తవ్య మగునట్లు తెలియఁబడుచున్నది—"స్వాధ్యాయోఽధ్యేతవ్యః'' అను వాక్యమందలి యర్థభావనయే, జ్యోతిష్టోమాది సకలయాగ విధాయకవాక్యములందుండు శబ్దభావనాస్వరూపమగుటచే, 'స్వాధ్యాయోఽధ్యేతవ్యః' అను వాక్యమునందుఁగూడఁ బూర్వో_క్తమగు నంశత్రయముతోఁ గూడిన యర్థభావనయే క_ర్తవ్యముగా నేల విధింపఁబడఁగూడదని శంకింపరాదు—స్వాధ్యాయవాక్యమునందు శబ్దభావన యెట్లు స్వరూపమాత్రముచేతనే విధింపఁబడుచున్నదో యావిషయ మీక్రింద విశదీకరింపఁబడుచున్నది. 'అధ్యేతవ్యః' (అధి + ఇ + తవ్య) అనుపదమునందు 'అధి' యను నుపసర్గతోఁ గూడినట్టియు,

(1) 'స్వాధ్యాయోఽధ్యేతవ్యః' అను వాక్యమందు శబ్దభావన యంశత్రయవిశిష్టమై తెలియఁబడుచుండుటచేఁ, గ_ర్తవ్యముగాఁ దెలియఁబడుచున్నదని చెప్పనగును. జ్యోతిష్టోమము మున్నగు యాగములను విధించువాక్యములం దన్నియో శబ్దభావన యంశత్రయము లేకుండుటచే స్వరూపమాత్రముచేతనే తెలియఁబడుచున్నదని చెప్పవలసియున్నది.

‘గురూపదేశపూర్వకముగాఁ జదువుట’ యను నర్థ మిచ్చునట్టియు ‘ఇ’ ధాతువుపైని కర్మమును బోధించు ‘తవ్య’ ప్రత్యయము విధింపఁ బడినది—ఇట్లు ‘అధ్యేతవ్యః’ అను పదమునకు ‘గురూపదేశపూర్వకముగాఁ జదువఁబడవలసినది’ అని యర్థము రాఁగా ‘చదువఁబడవలసినది’ అను కర్మార్థకప్రయోగమునకుఁ గర్మ యేదియని యాకాంక్ష కలుగఁగా ‘స్వాధ్యాయః’ అను పదమున కర్థమగు వేదము కర్మగా నన్వయించుచుఁ బ్రధానమగుచున్నది. కాఁగా నీప్రధానమైన స్వాధ్యాయమునకు సంస్కారమును గలిగించు నధ్యయనము, వ్రీహులనెడి ప్రధానమునకు సంస్కారమును గలిగించు ప్రోక్షణము మున్నగువానివలె గుణకర్మ మగుచున్నది. అధ్యయనముచే జనించు [1]నక్షరగ్రహణరూపమగు సంస్కారముతోఁ గూడిన స్వాధ్యాయమునకుఁ బ్రయోజన మేమని యాకాంక్ష కలుగఁగా స్వాధ్యాయమందలి ‘లిఙ్ లోట్, తవ్య’ ప్రత్యయములతోఁ గూడిన విధివాక్యముల సామర్థ్యముచే లభించునదియుఁ, గర్మములనాచరించుట కుపచరించునదియు, నగు యాగాదుల స్వరూపజ్ఞానము, ఇంద్రియగోచరమగుటచేతను, నాయా కర్మముల నాచరింపఁజేయుట మూలముగా స్వర్గము మున్నగు నలౌకిక శ్రేయస్సును గలిగించునదగుటచేతను ప్రయోజనమగుచున్నది. కర్మస్వరూపజ్ఞానము లేక కర్మల నాచరించుట సంభవింపదుగదా! [2]దృష్టఫలము సంభవించునపు డదృ[3]ష్టఫలమును గల్పించుట యుక్తము కాదు గాన నిచట యాగాదిస్వరూపజ్ఞానము దృష్టప్రయోజనమే యగునుగాని యదృష్టప్రయోజనము గానేరదు. స్వాధ్యాయమందలి విధివాక్యములందుండు లిఙాదిప్రత్యయములచే బోధింపఁబడునట్టియు,

(1) అక్షరగ్రహణము=పుస్తకముగాని గురూపదేశమును గాని యపేక్షింపవక్కరలేకుండ స్వయముగా సుస్వరముతోఁ బఠించుట. (2) దృష్ట=ఇంద్రియములచే గ్రహింపఁబడు. (3) అదృష్ట=ఇంద్రియములచే గ్రహింపఁబడని.

అంశత్రయముతోఁ గూడినట్టియు శబ్దభావనలన్నియు స్వాధ్యాయ విధిచేతనే కర్తవ్యములుగా విధింపఁబడుచున్నవి.

## నామధేయము

ఇఁక నామధేయము వివరింపఁబడును. అయ్యా? "జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత" అను వాక్యమందు 'యాగేన స్వర్గంభావయేత్' (యాగముచే స్వర్గము నుత్పాదించునది) అను నర్థము వివరింపఁబడఁగా, మిగిలిన 'జ్యోతిష్టోమేన' యను పదమున కన్వయ మెట్లన, జ్యోతిష్టోమపదము '[1]జ్యోతిష్టోమనామకేన యాగేన' అని భావనకుఁ గరణముగా నంగీకరింపఁబడిన యాగమునకు నామధేయముగా నన్వయించును. జ్యోతిష్టోమపదము యాగమునకు నామధేయమగుట యెట్లన, జ్యోతిస్సులనుపేరుగల [2]త్రివృత్తు మున్నగు [3]స్తోమము లీయాగమునందుఁ గలవు గాన దీనికి జ్యోతిష్టోమ మను నామము కలిగినది. యాగమునకుఁ ద్రివృత్తు మొదలగు స్తోమములతో సంబంధముండుట యెట్లు తెలియఁబడుచున్నదన, 'జ్యోతిస్సులనుపేరుగల త్రివృత్ స్తోమము, పంచదశస్తోమము, సప్తదశస్తోమము, ఏకవింశస్తోమము నను నీనాలుగు స్తోమములును దీనియందుఁగలవు' అనువాక్యమువలన నీయాగమునకు జ్యోతిస్సులను స్తోమములతో సంబంధమున్నదని తెలియుచున్నది. ఇట్లే మీమాంసాశాస్త్రమం దుండు తత్ప్రఖ్యము మున్నగు ప్రమాణములచే నాయావిధివాక్యములందున్న శబ్దములు యాగనామధేయము లగునని తెలియునది ఈశాస్త్రమందు 'తత్ప్రఖ్యము, తద్వ్యపదేశము, యౌగికము, వాక్య

1. జ్యోతిష్టోమమనెడి పేరుగల యాగముచేఁ దనయిష్టము నుత్పాదించుకొ[illegible]నలయును. 2. త్రివృత్ పంచదశ, సప్తదశ ఏకవింశ అను నామములుగల స్తోమములు గలవు. 3. స్తోమము = స్తోత్రముకు సాధనమైన ఋక్సమూహము,

భేదము ' అను నాలుగు ప్రమాణములచేతను, నాయాశబ్దములు యా
గములకు నామములగునని తెలియఁజేయఁబడుచున్నది.

తత్ప్రఖ్యన్యాయము

అది యెట్లంటేని "అగ్నిర్జ్యోతి ర్జ్యోతిరగ్నిస్స్వాహా, ఇతి
సాయంజుహోతి" (=ఁ అగ్నిర్జ్యోతి ర్జ్యోతిరగ్నిస్స్వాహా ' అను మం
త్రము నుచ్చరించి సాయంకాలము హోమము చేయునది.) అను
వాక్యముచే విహితమగు "అగ్నిర్జ్యోతి ర్జ్యోతిరగ్నిస్స్వాహా" అను
మంత్రముచేత నగ్ని దేవత ప్రా[1]ప్తించుచున్నది కావున "అగ్నిహో
త్రంజుహోతి" (=హోమముచే నిష్టమును సంపాదించునది) అను
వాక్యమందలి యగ్నిహోత్ర పదముచే నగ్నిదేవత హోమమును
ప్రధానమునకు గుణముగా విధింపఁబడుటలేదు. మఱి యేమన నగ్ని
దేవతను బ్రతిపాదించు "అగ్నిర్జ్యోతి ర్జ్యోతిరగ్నిస్స్వాహా"
(=అగ్ని దేవత 'జ్యోతిస్స్వరూపమైనది. దాని కొఱకు హోమమగుఁ
గాక). అను శాస్త్రముచేఁ దెలియఁబడు నగ్నిదేవతతో హోమము
నకుఁ గల సంబంధమును నిమిత్తముగాఁ జేసికొని, యగ్ని కొఱకు,
హోత్రము (=హోమము) దీనియందుఁ గలదు గాన, ‹అగ్నిహోత్రం
జుహోతి' యను వాక్యముచే విధింపఁబడిన హోమమున ‹అగ్ని
హోత్ర' పదము నామధేయమగుచున్నది. ‹అగ్నిహోత్రంజుహోతి'
యను వాక్యమందు ‹జుహోతి' యను పదమునందలి ‹తి' ప్రత్య
యముచే బోధింపఁబడు నర్థభావనయందు ధాతువున కర్థమగు
హోమము కరణముగా నన్వయించును గాన నాహోమమునకు నామ
ముగా నన్వయించు ‹నగ్నిహోత్ర' పదమునకు, "జ్యోతిష్టోమేన
స్వర్గకామోయజేత" అను వాక్యమునందలి ‹జ్యోతిష్టోమ' పదము
నకు ‹జ్యోతిష్టోమేన' (=జ్యోతిష్టోమముచే) అని తృతీయావిభక్తి

1. తెలియుచున్నది.

వచ్చునట్లు 'అగ్నిహోత్రేణ' (=అగ్నిహోత్రముచే) అని తృతీయావిభక్తి యేలరాదన, 'అగ్నిహోత్రమ్' (అగ్నిహోత్రిమును) అన పదమునందలి ద్వితీయావిభక్తియే [1]లక్షణచేఁ గరణమును బోధింపఁగలదు. మఱియు [2]'సాధింపఁబడనిది కరణము గానేరదు' అను న్యాయమువలనఁ జేయఁబడనిదెప్పుడును గరణముకాదు కావునఁ గరణమగు హోమమునకు [3]నర్థాపత్తి ప్రమాణముచే నావశ్యకమగు సాధ్యత్వము (=సాధింపఁబడుట=చేయఁబడుట) ను సూచించుటకు హోమనామమైన 'యగ్నిహోత్ర' పదముపై 'అగ్నిహోత్రమ్' అను ద్వితీయావిభక్తి యుచితమైయున్నది. కాఁగా 'అగ్నిహోత్రంజుహోతి' అను వాక్యమందు 'అగ్నిహోత్రి' పదము తత్ప్రఖ్యమను ప్రమాణముచే హోమనామమగుచున్నది.

---

1 పదమందలి సంకేతితార్థమును గ్రహింపఁజేయు సామర్థ్యము శక్తియనియు, నాయర్థము శక్యార్థమనియు వ్యవహరింపఁబడుచున్నది. ఎచటఁ బదము వలన శక్యార్థమును గ్రహించినచో వాక్యాన్వయము (లేక, తాత్పర్యము) కుదురదో, యచట శక్యార్థమును విడిచి, యాపదమువలననే శక్యార్థముతో సంబంధించు మఱియొక యర్థమును గ్రహింపవలసియున్నది. ఇచట మఱియొక యర్థము లక్ష్యార్థమని యు, దీనిని గ్రహింపఁజేయు పదసామర్థ్యము లక్షణ యనియు, నలంకారశాస్త్రమున వ్యవహారము గలదు. ఉ॥ 'గంగయందు గొల్లపల్లెకలదు' ఈవాక్యమందు 'గంగ' పదమునకు శక్యార్థమైన జలప్రవాహము ననుసరించినచో, వాక్యార్థము కుదురదు గాన, శక్యార్థమైన జలప్రవాహముతో సంబంధము గల 'తీరము' అను లక్ష్యార్థము నాగంగాపదమువలననే గ్రహింపవలసియున్నది. ఇట్లయినచో 'గంగాతీరమందు గొల్లపల్లెకలదు' అని సరియైన యర్థమేర్పడుచున్నది. 2. సాధింపఁబడనిది=చేయఁబడనిది. 3. ఏది లేనియెడల నేది సిద్ధింపదో యది దానిచే గ్రహింపఁజేయఁబడుచున్నది. ఉదా. 'దేవదత్తుఁడు బలసియున్నాఁడు. పగలు భుజింపఁడు' అనునది వినినతోడనే దేవదత్తుఁడు రాత్రి భుజింపని యెడలఁ దాను బలసియుండుట సిద్ధింపదు గాన, నట్టివాఁడు బలిసియుండుటవలన 'రాత్రి భుజించుచున్నాఁడు' అనునది గ్రహింపఁజేయఁబడుచున్నది. ఇట్లు గ్రహింపఁజేయునట్టి ప్రమాణమునకు 'అర్థాపత్తి' యని పేరు.

## తద్వ్యపదేశన్యాయము

అట్లే "శ్యేనేన అభిచరన్‌యజేత" అను విధివాక్యమందు 'శ్యేన' పదము తద్వ్యపదేశమను ప్రమాణముచే నిందలి యాగమునకు నామమే యగుచున్నది. కాని 'శ్యేన' పదమున కర్థమగుడేగ, యాగమునకు గుణముగా మాత్రము విధింపఁబడుట లేదు. ఏలయన 'శ్యేన మెట్లితర పక్షుల పైఁబడి హింసించునో యట్లే యీయాగము యజమానుని ద్వేషించు శత్రువుపైఁబడి పట్టుకొనును.' అను డేగకును యాగమునకును గల యుపమానోపమేయభావము సిద్ధింపనేరదు గావున, శ్యేనపక్షి యాగమునకు గుణముగా విధింపఁబడుటకు వీలులేదు. ఈయుపమానోపమేయభావము, 'శ్యేన' పదము యాగనామమైనపుడే, సిద్ధించును. అట్లుకాక శ్యేనపక్షి యాగమునకంగముగా విధింపఁబడిన యెడల [1]దనకుఁ (=శ్యేనమునకు) దనతోనే యుపమానోపమేయభావము సిద్ధింపవలసివచ్చును. అది తగదు. కనుక నిచట 'శ్యేన'పదము యాగనామధేయ మగుచున్నది. కాఁగా "శ్యేనేనాభిచరన్‌యజేత" అను వాక్యమువలన 'శత్రువధను గోరువాఁడు, శ్యేనమను పేరుగల యాగముచే నిష్టమగు నభిచారము (శత్రువధ) నుత్పాదించునది.' అను నర్థము సిద్ధించుచున్నది. 'అయ్యో! అభిచారము గూడ వేదమునందు వినఁబడుచున్నది గాన నభిచారమును గలిగించు కర్మములందా స్తికులకుఁ గూడఁ బ్రవృత్తి గలుగునేమో' యన నీయభిచారము వేదమందు వినఁబడుచున్నదైనను, ఫలమగుటవలనఁ గర్తవ్యముగా విధింపఁబడుటలేదు. ఫలమెప్పుడును విధింపఁబడదు. కాని యొక ఫలమును సంపాదించుటకై దానికి సాధనముగాఁ గర్మమే విధింపఁబడునని మీమాంసకుల సిద్ధాంతము. కాఁబట్టి యభిచారము విధింపఁబడని దగుటవలన

1. ఏది విధింపఁబడునో యదియే యర్థవాదములచే స్తుతింపఁబడును.

నాచరింపఁబడిన యెడలఁ బ్రత్యవాయము (=నరకాది దుఃఖము)ను గలిగించును.

## యౌ గి క న్యా య ము

ఇటులనే "ఉద్భిదాయజేత పశుకామః" (=పశువులను గోరువాఁ డుద్భిత్తను పేరుగల యాగముచే నిష్టమును సంపాదించునది) అను వాక్యమందుఁ బశు వనెడి ఫలమునకు సాధనముగా విధింపఁ గోరఁబడిన యాగమునకు 'ఉద్భిత్త' ను పదము నామధేయమగుచున్నది. కాని యెట్లో మఱియొక విధివాక్యమువలనఁ బ్రాప్తించిన యాగము నుద్దేశించి దానికంగముగా 'ఉద్భిత్తు' (=మొలక) అను గుణము విధింపఁబడుటలేదు. దధిమున్నగువానివలె 'ఉద్భిత్త' ను పేరుగల గుణ ముండుట లోకమం దప్రసిద్ధముగదా! ఉద్భిత్పదమునకు యాగమే యర్థమైనచో [1]'దీనిచే ఫలముత్పన్నమగును'నను నవయవార్థము సిద్ధించుచున్నది గాన నుద్భిత్పద మిచట యాగనామమే యగుచున్నది. "అయ్యా? 'దీనిచే భూమి పైకిఁ బెల్లగింపఁబడుచున్నది' అను నవయవార్థము మూలముగా, నుద్భిత్పదము, గునపము మున్నగువానిని బోధింపఁగలుగును గాన, నీవాక్యమందు, గునపము మొదలగునవి యాగమున కంగములుగా నేల విధింపఁబడఁ గూడదు" అని శంకింపఁదగదు. ఇట్టి స్థలములయం దిచటను గుణవిధి కలదని చెప్పుట యశక్యము. అట్లు చెప్పినచోఁ బరస్పరము విరుద్ధములగు రెండు త్రికము లొకచోఁ గూడుట యను దోషము సంభవించును. అది యెట్లనః—"ఉద్భిదాయజేత పశుకామః" అను వాక్యమంద [2]వాక్యాంతరముచేఁ బ్రాప్తించిన యాగమును సూచించుట సంభవింపదు గానఁ, బశువే ఫలముగాఁ గల భావనయందు, యాగముచే

1. ఉద్భిద్యతే ఫలమనేనః_అనేన = దీనిచే; ఫలమ్ = ఫలము ; ఉద్భిద్యతే ఉత్పన్నమగును. 2. మఱియొకవాక్యము.

బశువుల నుత్పాదించునది యని యాగము కరణముగా విధింపఁబడ వలసియున్నది. కాఁగా యాగమునకు విధింపఁబడుటయు, ఫలమున కంగముగాఁ దెలియఁబడుటచే గుణమగుటయు, ఫలసిద్ధి కొఱకుఁ బురుషునిచే నాచరింపఁబడునది గాన నుపాదేయమగుటయు, నను మూఁడు ధర్మములొకేసారి సంభవించుచున్నవి. అట్లే యాగమును గుఱించి యుద్భిత్తను గుణము విధింపఁబడుచున్నది గాన, విధింపఁ బడుచున్న గుణములను బట్టి యాగమునకుఁ బ్రధానమగుటయు నుద్దేశ్యమగుటయు, ననువదింపఁ (సూచింపఁ) బడుటయు నను మూఁడు ధర్మములు నొకేసారి సంభవించును. ఇట్టి పరస్పర విరుద్ధములగు రెండు త్రికములు నొకే యాగమందు సంభవింపవలసివచ్చును. కావున "ఉద్భిదాయజేత పశుకామః" అనుచోట గుణము విధింపఁ బడుటలేదు. "'సోమేన యజేత' (=సోమముతోఁగూడిన యాగముచే నిష్టము నుత్పాదించునది) అను వాక్యమందు విరుద్ధత్రికమున్నగు దోషములు లేకుండఁగనే సోమపదమునకు లక్షణచే 'సోమముగలదీ' యను నర్థము నంగీకరించి 'సోమముతోఁగూడిన యాగముచే నిష్టము సంపాదించునది' అని సోమముతోఁగూడిన యాగము విధింపఁబడుచున్నది గాన, నచట సోమమను గుణమెట్లు విధింపఁ బడుచున్నదో, యట్లే యిచట నుద్భిత్పదమునకుఁగూడ లక్షణచే 'నుద్భిత్తుగలది' అను నర్థము నంగీకరించుటవలన, నుద్భిత్తను గుణముతోఁగూడిన యాగము విధింపఁబడుచున్నది." అని శంకింపఁ దగదు. "సోమేనయజేత" మున్నగు స్థలములయందుపాయాంతరము లేకపోవుటవలన, సోమము మున్నగు పదములకు లక్షణచే మత్వర్థము (=అది గలదియను నర్థము) నాశ్రయించుటవలన సోమము మున్నగువానితోఁగూడిన యాగము విధింపఁబడుచున్నది యని యంగీకరింపఁబడవలసి యున్నది. "ఉద్భిదాయజేత పశుకామః"

మున్నగు వాక్యములందన్నను యుద్భిత్తు మొదలగుపదములు యాగ నామధేయములుగా నుండఁదగునుగాన, 'ఉద్భిత్తు' మున్నగువాని తోఁగూడిన యాగములు విధింపఁబడుచున్నవని యంగీకరించుట తగదు. కావున నుద్భిత్తుమున్నగు పదములందలి యవయవార్థము వలన నవి యాగనామములే యగుచున్నవి—

## వాక్యభేదన్యాయము

అట్లే "చిత్రయా యజేత పశుకామః" (=పశువును గోరు వాఁడు 'చిత్రి' యను పేరుగల యాగముచే నిష్టము నుత్పాదిం నది) అను విధివాక్యమందు 'చిత్రా' పదము ప్రజాపతి దేవతగ గల యాగమునకుఁ బేరగుచున్నది. "'పెరుఁగు, తేనె, నేయి, జలము వేపుడుబియ్యము, బియ్యము' నను నీయాఱిట కూడిక, ప్రజా దేవతగాఁగలది" అను విధివాక్యమందు వానికూడికకును, 'ప్రజా దేవతగాఁగలది యనుదానికిని, సామానాధికరణ్యమువలనఁ బెరు మున్నగు నాఱు ద్రవ్యముల కూడికకుఁ బ్రజాపతి దేవతతో సంబ ముండునట్లు తెలియుచున్నది. కనుక నట్టిసంబంధముచే నూహిం బడు యాగమొకటి యీవాక్యమందు విధింపఁబడుచున్నది. ఇ విధింపఁబడిన యాగమునకు ఫలమేమని యాకాంక్ష కలుగ "పశువును గోరువాఁడు చిత్రియను పేరుగల యాగముచే నిష్ట నుత్పాదించునది." అనువాక్య మీయాగమునకు ఫలముతోఁ సంబంధమును విధించుచున్నది. ఈయాగము 'పెరుఁగు, తేనె' యీ మున్నగు వాక్యముచే మొదటవిధింపఁబడినదైనను 'పశు గోరువాఁడు'... మొదలగు నీవాక్యముచేఁ దనకు ఫలసంబంధమ బోధించుటకై మరల విధింపఁబడుచున్నది. ఆయీ ప్రజాపతి తగాఁగల యాగము పెరుఁగు మున్నగు ననేకద్రవ్యములు గలద

చేత, దానికి ‘[1]చిత్ర’ అను పదము నామధేయమగుచున్నది. కాని “అగ్నీషోమీయం పశుమాలభేత” (=అగ్నీషోములను జంటదేవతల కొఱకుఁ బశువునిచ్చి యజించుటచే నిష్టము నుత్పాదించునది) అను విధివాక్యముచే విధింపఁబడిన పశుయాగమును, “చిత్రయాయజేత పశుకామః” అనువాక్యమునందలి ‘యజేత’ అనుపదము మూలముగా నను[2]వదించి యా యాగసంబంధియగు పశువునుగూర్చి ‘చిత్రవర ము గలిగియుండుట, స్త్రీయై యుండుట’ అను రెండు గుణములు విధింపఁబడవచ్చునని, యనరాదు. వాక్యాంతరముచే విధింపఁబడిన కర్మము నుద్దేశించి దానినిగూర్చియే యనేక గుణములు విధించినచో “పశువులను గోరువాఁడు చిత్రవర్ణముగల పశువుచే యజించి యిష్టము నంపాదించునది. ఆ పశువు స్త్రీయై కూడ నుండవలయును” అను[3]వాక్యభేదము సంభవించునుగదా! “వాక్యాంతరముచే విధింపఁబడినకర్మమునుగూర్చి యనేకగుణములు విధింపఁబడుట యశక్యము” అను [4]ప్రమాణమువలన నిచట ననేకగుణములు విధింపఁగూడదని తెలియుచున్నది. మఱియొక వాక్యముచే విధింపఁబడని కర్మము నుద్దేశించి యన్ననో “యదాగ్నేయ......భవతి”(=అమావాస్యయందు...) ఈమున్నగు నొక విధి వాక్యముచేతనే, యష్టాకపాలపురోడాశము, అమావాస్య, పూర్ణిమ, మొదలగు ననేక గుణములతోఁ గూడినట్టియు, ద్రవ్యదేవతల సంబంధముచే నూహింపఁబడినట్టియు, యాగము విధింపఁబడుచున్నదని మీమాంసకుల సిద్ధాంతము. ఇందులకు [5]వాక్యాంతరముచే నెచటను విధింపఁబడని కర్మము నుద్దేశించి

1. పలువిధములుగలది.

2 అనువదించి=సూచించి 3. ఒకటే యన్వయము కలుగునట్లుద్దేశింపఁబడిన వాక్యమును రెండు వేఱువాక్యములుగా విభజించి యన్వయించుట. 4. “ప్రాప్తే కర్మణి నానేకో విధాతుం శక్యతే గుణః” అని మూలము. 5. “అప్రాప్తే తు విధీయంతే బహవోఽప్యేకయత్నతః” అనిమూలము.

మాత్ర మనేక గుణములుకూడ నొక విధివాక్యముచేతనే విధిం బడవచ్చును" అను ప్రమాణము గలదు.

ఇచట నీక్రింద వివరింపఁబడు శంకకలదు. "పశునాయజే (=పశువుచే యజించి యిష్టమునుసంపాదించునది.) అనువాక్యమం వేఱొక వాక్యముచే విధింపఁబడిన యాగమును 'యజేత' పద నందలి యజ్ధాతువుమూలముగా ననువదించి, దాని కంగమ 'పశునా' అనెడి యొక పదముచేతనే గ్రహింపఁబడు పశువను ద్ర ము, దానిలింగము, సంఖ్య, యను మూఁడు గుణములును వా భేదము లేకుండఁగనే విధింపఁబడుట యొ ట్లంగీకరింపఁబడుచున్న యట్లే "చిత్రయా యజేత పశుకామః" అను వాక్యమునందుఁగ 'చిత్ర' అనెడు నొకపదముచే గ్రహింపఁబడు చిత్రవర్ణము గలదగ స్త్రీయగుట యను రెండు గుణములతోఁగూడిన పశువనెడి కారక విధింపఁబడవచ్చును గాన వాక్యభేదము రాదు. అందువలననే " నా యజేత'' అను వాక్యమునందు విధేయమైన పశువు పాదేయ గనుక దానియందలి యేకత్వము, యజ్ఞమున కంగముగా వివక్షి బడుచున్నదిగనుక నీవాక్యముచేత 'ఒక పశువుచేతనే యాగ చేయవలయును.' అను నర్థ మేర్పడుచున్నది. "గ్రహం సమ్మా (=గ్[1]హములను దుడువవలయును.) అను వాక్యమందు గ్రహ వ శ్యము గనుక, దానియం దుండెడు నేకత్వ ముద్దేశ్యమునందుఁ దగుటచే వివక్షింపఁబడదుగదా! అది యెట్లంటేని:—"గ్ర సమ్మార్ష్టి'' యను వాక్యమందు 'గ్రహం' (=గ్రహమును) అను యందలి ద్వితీయావిభక్తిచే గ్రహము మిక్కిలి కోరఁదగినఁదగ జేసి, యుద్దేశ్యము, ప్రయోజనము గలదియు నగుటవలనఁ బ్ర

1. గ్రహములు=సోమరసమునుంచు పాత్రములు,

మని తెలియఁబడుచున్నది. [1]సమ్మార్జన (తుడుచుట) మన్ననో గ్రహ మునకు గుణమగుచున్నది. "గుణమనునది ప్రధానము లన్నిటిలోఁ బ్రతిదానితోను సావృత్తిచే సంబంధింపఁ జేయఁబడవలసినది." అను [2]న్యాయముచే గ్రహము లెన్ని గలవో వానియన్నిటికిని సమ్మార్గము (=తుడుచుట) ఆవశ్యకమని నిశ్చయింపఁబడగా, "ఎన్ని గ్రహములు (పాత్రములు) తుడువఁబడవలసినవి?" అని యాకాంక్ష కలుగదుగాన నుద్దేశ్యము (గ్రహము) నందలి యేకత్వము ద్వితీయైకవచనముచేఁ దెలి యఁబడుచున్నదైనను వివక్షింపఁబడదు. ఈయేకత్వము ద్దేశ్యమునం దుండునది కాదు. మఱేమన, "గ్రహమును దుడువవలయును. ఆగ్రహ మొక్కటియేయై యుండవలయును." అనురీతిని దాను స్వయముగా విధేయమే యగుచున్నది. అని శంకింపరాదు. అట్లు శంకించినచో విధే యములు (సమ్మార్గము, ఏకత్వము ననునవి) వేఱగుటచే వాక్యములు గూడ "గ్రహమును దుడువవలయును. ఆగ్రహ మొక్కటియేయై యుండు నది" అని వేఱుగా నుండవలసివచ్చును. అట్టి (గ్రహము లెన్నియని) యాకాంక్ష లేకపోవుటచేతను, నందుచేతనే యాయేకత్వమును బ్రత్యే కించి విధింపవలసిన యావశ్యకత్వము లేకపోవుటచేతను గ్రహమనెడి యుద్దేశ్యమందలి యేకత్వమను సంఖ్య వివక్షింపఁబడనేరదు. ఉద్దే శ్యమునందలి విశేషణములలో దేనిని వివక్షింపనియెడల నుద్దేశ్య స్వరూపమే గ్రహింపఁబడదో యట్టి విశేషణముమాత్ర ముద్దేశ్య మునం దుండునదైనను వివక్షింపఁబడఁగలదు. ఇచటనే 'గ్రహ' మం దలి గ్రహత్వమను విశేషణము వివక్షింపఁబడుచున్నది. దానిని వివ క్షింపనియెడల నుద్దేశ్యమగు గ్రహముయొక్క స్వరూపము తెలియ శక్యము కాదుకదా! ఇట్లు గ్రహత్వమను విశేషణమును వివక్షించుట

1. సమ్మార్జనము=సమ్మార్గము=తుడుచుట 2. "ప్రతిప్రధానం గుణ ఆవర్త నీయః" అనిమూలము.

చేతనే "గ్రహజాతిలోఁ జేరిన పాత్రములు సాధనము గాఁగల సోమ యాగమునకు సంబంధించు నపూర్వమును గలిగించున దైనను చమ సలను పేరుగల పాత్రములకు సమ్మార్గము లేదు." అని, [1] శాబర భాష్యమునందుఁ గలదు. "పశునా యజేత" అను వాక్యమందుఁ బ్రధానమగు యాగము నుద్దేశించి పశువు విధేయమగుటవలన గుణ మగుచున్నది. "ప్రధానమనునది గుణము లన్నిటిలోఁ బ్రతిదాని తోను నావృత్తిచే సంబంధించుట తగదు" అనున్యాయముచే "ఎన్ని పశువులచే యాగము చేయఁబడవలసినది?" అని యాకాంక్ష కలు గఁగా; 'పశునా' అనుపదమునందలి యేకవచనముచేఁ దెలియఁబడినదై పశువను విధేయమునందుండు నేకత్వ మట్లాకాంక్షింపఁబడుటచే వివక్షింపఁబడుచున్నది. ఇంతేగాక (పుం) లింగము (ఏకత్వ) సంఖ్యఅను నీ రెండింటిచే గుర్తింపఁబడిన పశువను కారకము, 'పశునా' అను నేకవచనముచే గ్రహింపఁబడినదై విధేయ మగుచున్నది గాన, నట్లు విధేయమగు పశువుమూలముగా, దానియందలి లింగసంఖ్యలుకూడఁ గ్రియకంగములగుటంచేసి యచట నేకత్వము వివక్షితమగుచున్నది. లేదా; 'పశునా' అను పదమునందలి తృతీయావిభక్తిచేఁ దెలుపఁబడు లింగసంఖ్య, లా విభక్తిచేతనే బోధింపఁబడు కరణ కారకశక్తి కధీన ములై, పశువను ప్రాతిపదిక కర్థమగు పశుద్రవ్యముతో సంబంధము నొల్లక, యా పశుద్రవ్యమువలెనే సాక్షాత్క్రియాంగముగా విధింపఁ బడున వగుచున్నవి. అట్లు విధింపఁబడి యీక్రింద వివరింపఁబడఁబోవు నరుణైకహాయనీ న్యాయము రీతిని, "యాగమున కంగముగ నేపశువు విధింపఁ బడుచున్నదో, యట్టి పశు వొకటియుఁ బురుషజాతిలోఁ జేరినదియు నగుచున్నది" యని పశుద్రవ్యముతో

1. జైమినిచే రచియింపఁబడిన పూర్వమీమాంసా సూత్రములకు శబరస్వామి కృతమైన భాష్యము కలదు.

సంబంధించుచున్నది. అరుణైకహాయనీన్యాయ మెట్టిదనః—"అరుణయాపింగాక్ష్యా ఏకహాయన్యా (గవా) సోమం క్రీణాతి" (ఎఱ్ఱనిదియుఁ బచ్చనికన్నులు గలదియు, నొక సంవత్సరము వయసుగలదియు, నగు గోవు నిచ్చి సోమలతను గొనునది) అనువాక్య మొకటి కలదు. ఇచట "కారకములు క్రియతోఁ నన్వయించును" అను నియమమువలన 'అరుణయా' మున్నగు నాలుగు శబ్దములందును గరణమును బోధించు తృతీయావిభక్తులచే 'అరుణ్యము' (ఎఱుపు) 'పింగాక్షీత్వము' (పచ్చని కన్నులు గలుగుట) 'ఏకహాయనీత్వము' (ఒకసంవత్సరము వయసు గలిగి యుండుట) 'గోత్వము' (గోజాతి) అను నీ నాలుగు ధర్మములును నొకదానితో నొకటి సంబంధింపకయే, సోమలతను గొనుట కరణము లుగా నన్వయించుట కుద్యుక్తములుకాఁగా, నారుణ్యము మున్నగు ధర్మము లమూర్తములగుటంజేసి స్వయముగాఁ గ్రియకు సాధనములు కానేరవు. కావున నీ యారుణ్యాదిధర్మములు, సోమమును గొనుట యను క్రియకు సాక్షాత్తుగా సాధనమగునట్టియు, నొక సంవత్సర మీడు గలిగినట్టియు గోవును గుర్తింపఁజేయుటమూలముగాఁ, గ్రియతో మొదట నన్వయించిన గోవునకు విశేషణములుగా నొకదాని వెంబడి నొకటి పిదప నన్వయించుచున్నవి. "ఒక సంవత్సర మీడుగల గోవేదిగలదో యది పచ్చనికన్నులు గలదియు నెఱ్ఱనిరంగుగలదియునై యుండునది" అని యారుణ్యాదిధర్మములు వాక్యభేదము లేకయే యొకదానితో నొకటి యెట్లన్వయించుచున్నవో యట్లే "చిత్రయా యజేత పశుకామః" అను వాక్యమందుఁ గూడ చిత్రాత్వమును స్త్రీత్వమును యజ్ఞాంగమగు పశువును గుర్తింపఁజేయుట మూలముగా నొకదానితో నొకటి యన్వయింపవచ్చును. కాఁగా "నుద్దేశ్యమునం దుండు విశేషణము వివక్షితము కానేరదు. ఉపాదేయమందుండు విశేషణము వివక్షిత మగును." అని శాబరభాష్యమునందుఁ గలదు. కావున "చిత్ర

యా యజేత పశుకామః' అను వాక్యమందు 'చిత్రాత్వము, స్త్రీత్వము' అను రెండుధర్మములచే గుర్తింపఁబడిన పశువను కారకము, 'యజేత' అను పదముచే ననువదింపఁబడు నగ్నీషోమీయ పశుయాగమందు 'చిత్రా' పదముచే విధింపఁబడుచుండఁగా 'చిత్రా' అనుపదము 'యజేత' అను పదముచే బోధింపఁబడు యాగమునకుఁ బేరని యెట్లు చెప్పనగును? ఇట్లు శంకయొక్క స్వరూపము:—

పైనఁ జేయఁబడిన శంక కీ సమాధానము గలదు. అట్లు "చిత్రయా యజేత పశుకామః" అను వాక్యమందు గుణవిధానము కలదని చెప్పినచో నిచటఁ బ్రస్తుతమైనదియు, ఫలసంబంధము నపేక్షించు నదియు నగు ప్రాజాపత్యయాగమును విడుచుటయు, నప్రస్తుతమగు నగ్నీషోమీయయాగమును గ్రొత్తగఁ గల్పించుటయు సంభవించును. అవి రెండును ననుచితములు. కనుక నిచట 'చిత్రా' పదము 'యజేత' పదముచే ననువదింపఁబడిన యాగమునకు నామధేయ మగుచున్నది. ఇట్లే యిటువంటి విధివాక్యములం దెల్ల 'తత్ప్రఖ్యము' మున్నగు నాలుగు ప్రమాణములలో నేదే నొకదానిచేఁ గర్మనామధేయము నిర్ణయింపఁబడవలసియున్నది. ఇట్లు విధివాక్యముయొక్క ప్రామాణ్యము విశదీకరింపఁబడినది.

## అ ర్థ వా ద ము లు

విధులు, అర్థవాదములు నని బ్రాహ్మణము రెండువిధములుగా నున్నది. అందు మొదటిదగు విధియొక్క స్వరూపమును, దాని స్వతంత్రమగు ప్రామాణ్యమును పైవిధముగా వివరింపఁబడినవి. అర్థవాదము లన్ననో, యవి తమయందలి వాచ్యార్థము (=ముఖ్యార్థము=శబ్దార్థము)నే బోధించినచోఁ బ్రయోజనముగాని ఫలముగాని యేవి

యు లేకపోవుటంజేసి, య[1]ధ్యయనవిధి స్వర్గాదిఫలములను జనింప జేయు యాగముల స్వరూపజ్ఞానముతోఁ గూడిన వేదపాఠమునే యవశ్యముగా విధింపఁజేయుచున్నది గాన, నీ యర్థవాదములు విధివాక్యములందలి విధేయములగు కర్మములు మున్నగువానియందుండు ప్రాశస్త్యము (శ్రేష్ఠత్వము)ను దెలుపుటమూలముగా విధివాక్యములతో నేకాన్వయమును బొందుచుఁ బ్రమాణములగుచున్నవి. ఆయర్థవాదములు (i) నిందార్థవాదములు, (ii) ప్రశంసార్థవాదములు (iii) పరకృత్యర్థవాదములు (iv) పురాకల్పార్థవాదములు నని నాలుగువిధములుగా నున్నవి. (i) వానిలో నిందార్థవాదములకు (నిషేధింపఁబడువానిని నిందించునవి.) ఉదాహరణములు. (1) "అసత్రం వా ఏతత్ యదచ్ఛందోమమ్" (ఛం[2]దోమ మేక్రతువునం దుండదో యది సత్రమని చెప్పఁబడఁదగదు.) ఈ మొదలగు వాక్యములు. (2) "అ[3]శ్రుజం హి రజతం

---

(1) "స్వాధ్యాయోఽధ్యేతవ్యః" అనునది. (2) చతుర్వింశస్తోమము, చతుశ్చత్వారింశస్తోమము, అష్టాచత్వారింశస్తోమము అను నీ మూఁడిటి సంఘమునకును ఛందోమమని పేరు. ఈస్తోమములం దుండు సంఖ్యలు మూఁడును గాయత్రి, త్రిష్టుప్, జగతి యను మూఁడు ఛందస్సులయందలి యక్షరసంఖ్యలతో సమానముగా నుండుటంజేసి, యీమూఁడు స్తోమముల సంఘమునకును 'ఛందోమము' (ఛందస్=ఛందస్సులసంఖ్యతో, మ=సరియగు సంఖ్యగలది) అని పేరు గలిగినది.

(3) పూర్వ మొకప్పు డింద్రుఁడు రాక్షసులవలని భయముచేఁ దన యైశ్వర్యము నంతను నగ్ని కొప్పగించి దానిని సంరక్షింపుమని నియోగించెను. ఆభయము తీరిన వెంటనే యగ్నిని దీసికొని రండని యింద్రుఁడు భటుల కాజ్ఞాపింప వారతనిని స్వర్గలోకమునం దెచటను గానక తుదకు సముద్రము చొచ్చి దానియం దొకచోట నతనిఁ గని బంధించి యింద్రునియొద్దకుఁ దీసికొనివచ్చిరి. అప్పు డింద్రుఁడు 'నా యైశ్వర్య మేది?' యని యడుగఁగా 'నే నెఱుఁగ' నని యగ్ని సమాధానము చెప్పెను. అపుడు కోపోద్దీపితుఁడైన యింద్రు నాజ్ఞచే భటు లగ్నిని దండింప నతఁడు రోదనము చేసెను. అపు డా యగ్ని నేత్రములనుండి స్రవించి క్రిందఁబడిన కన్నీటివలన వెండి పుట్టినది—

యో బర్హిషి దదాతి, పురాఽస్య సంవత్సరాత్ గృహేరుద న్తి" (రజతము కన్నీటివలన నుత్పన్నమైనదిగదా! ఎవఁడు దానిని గురువున కిచ్చు దక్షిణగా దర్భలయం దుంచునో వాని గృహమునందు సంవత్సరములోఁగా రోదనము సంభవించును) ఈ మున్నగు వాక్యములును (ii) ప్రశంసార్థవాదము (విధింపఁబడుదానియందలి గుణమును దెల్పుచుఁ బ్రశంసించునవి.)లకుదాహరణములు. (1) "శోభ తేఽస్యముఖం య ఏవం వేద" (ఎవఁ డీక్రతువుయొక్క స్వరూపమును లెస్సగాఁ దెలిసికొనునో వానిముఖము కాంతితోఁ బ్రకాశించును.) ఈ మొదలగు వాక్యములును (2) "వాయుర్వై క్షేపిష్ఠా దేవతా" (వాయువు మిగుల శీఘ్రముగా సంచరించు దేవత కనుక నైశ్వర్యమును గోరువాఁడు వాయువు నుద్దేశించి శ్వేతపశువుచే యాగము చేయుటవలన నిష్టమగు నైశ్వర్యము నుత్పాదించునది' అను విధిచే వాయువుకొఱకు యాగము చేయు యజమానునకుఁ గలుగఁదగిన యైశ్వర్య మతిశీఘ్రముగాఁ బ్రాప్తించును) ఈ మొదలగు వాక్యములును, (iii) 'ఈ కర్మ మొక మహాపురుషునిచేఁ జేయఁబడినది.' అనెడి యర్థమును దెలియఁజేయు నర్థవాదమునకుఁ బరకృతియని పేరు. దాని కుదాహరణము. "అగ్నిర్వా అకామయత, అన్నాదో దేవానాంస్యామితి" (అగ్ని 'తాను దేవతలకొఱకు నన్నము తినువాఁడు కావలయును' అని కోరి యగ్ని కొఱకును గృత్తికలకొఱకును నష్టాకపాలమగు పురోడాశము నిచ్చి యజించెను. ఈయాగము ప్రశస్తమైనదని తెలియఁజేయుటకొఱకు మహాపురుషుఁడైన యగ్ని యీ యాగమును జేసెనని యర్థవాదమునందు వర్ణింపఁబడినది.) ఈ మున్నగునవి (iv) ఎవఁడో యొక మహాపురుషు డీకర్మమును గూర్చి యిట్లు చెప్పెనని తెలియఁజేయు నర్థవాదమునకు బురాకల్పమని పేరు. దాని కుదాహరణము:—"తమశపత్ ధియా ధియా" త్వావధ్యాసుః (పూర్వ మగ్నిమత్స్యమును గూర్చి 'ప్రతిమా

జూఁడును నిన్నుఁ జంపును' అని శపించెను. ఇట్లు మత్స్య మగ్నిచే శపింపఁబడిన దగుటంజేసి, మత్స్యహననము నింద్యము కాదు.) ఈ మున్నగు వాక్యములు. ఈ నాలుగిటిలో నిందార్థవాద మనునది విధేయముకంటె భిన్నమగుదానిని నిందించుటమూలముగా విధేయమగు దానిని ప్రశంసించునదియే యగుచున్నది. 'అశ్రుజం హి రజతం' ఈ మున్నగు నర్థవాదము [1]విధేయముకంటె భిన్నమగు రజతదానమును నిందించుచు, విధేయమైన రజతదాననిషేధమును ప్రశంసించునదియే యగుటవలన నిది నిందార్థవాదమను పేరుగలదైనను, విధేయమునందలి ప్రాశస్త్యమునే బోధించునని చెప్పుటలో విరోధము లేదు—ఇతరములగు మూఁడువిధములు గల యర్థవాదము లన్ననో, యవి సాక్షాత్తుగా విధేయమందలి ప్రాశస్త్యమునే తెలియఁజేయుచున్నవి. "వాయుర్వై..." ఈ మున్నగు నర్థవాదమందు, "వాయువు శీఘ్రముగా సంచరించుచు ఫలమును వేగముగా నిచ్చువాఁ డగుటవలనఁ బ్రశస్తమగు దేవత యగుటంజేసి, యతఁడు దేవతగాఁగల కర్మము ప్రశస్తమైనది." అని తెలియఁజేయుచున్నది. కనుక నీ యర్థవాదము విధేయమగు వాయుదేవతయం దుండు ప్రాశస్త్యమును దెలియఁజేయుట మూలముగా విధితో నేకాన్వయమును బొందుచున్నది. "అగ్నిర్వా అకామయత" ఈ మున్నగు నర్థవాదమం దగ్ని దేవతగాఁగల యాగము పూర్వ మగ్నిచేఁ జేయఁబడినదగుటచేఁ బ్రశస్తమై, యిపుడు కూడ నితర యజమానులచే నవశ్యముగాఁ జేయఁబడవలసినదని తెలియఁజేయఁబడుచున్నది. కాఁగా నీ యర్థవాదము విధేయమగు కర్మమందుండు ప్రాశస్త్యమును దెలియఁజేయుటమూలముగా విధివాక్యముతో నేకాన్వయమును బొందుచున్నది. ఇటులనే యితరార్థవాదములయం

1. వి. వా—"బర్హిషి రజతం న దేయమ్"=రజతమును దక్షిణగా బర్హిస్సునందుంచరాదు.

దుఁగూడ విధేయమందలి ప్రాశస్త్యమే తెలియఁజేయఁబడుచున్నదని యూహించునది. కొన్ని యర్థవాదములకు మ[1]఼తియొక ప్రయోజనము కూడఁ గలదు. ఉదాహరణము:—"అక్తాశ్శర్కరా ఉపదధాతి" (తడుపఁబడిన గులకరాల నుంచునది.) అను విధివాక్యమందు 'తడుపఁబడిన' అనుపదమువలన నేదే నొక ద్రవద్రవ్య మిచటఁ గావలయునని తెలియుచున్నది. ఇట్టి ద్రవ్య మిదియా యదియా యని సందేహము కలుగఁగా, నీవిధికి సమీపమందుండు "తేజో వై ఘృతమ్" (నేయి, తేజోమయమైనది.) అను నర్థవాదమువలన నచట నేయి యను ద్రవద్రవ్యమే వినియోగింపఁబడవలసినదని నిర్ణయింపఁబడుచున్నది. కనుక "తేజో వై ఘృతమ్" అను నర్థవాదము సందేహముగల స్థలములందు నిర్ణయమును దెలియఁజేయుటమూలముగాఁ గూడఁ బ్రామాణ్యము నొందుచున్నది.

## మంత్రములు

విధులు నర్థవాదములునని రెండువిధములుగల బ్రాహ్మణముల స్వరూపము పైవిధముగా నిరూపింపఁబడినది. మిగిలిన వేదభాగమగు మంత్రముల స్వరూప మిఁక నిరూపింపఁబడును. అధ్యయనవిధిచే సకల వేదమును ఫలమును జనింపఁజేయు జ్ఞానమే ప్రయోజనము గాఁగలదని తెలియుటవలన, వేదమునందుండు మంత్రములుగూడ స్వర్గాదిఫలములను జనింపఁజేయు కర్మములయొక్క స్వరూపజ్ఞానమను దృష్టప్రయోజనమే కలవిగాని, యదృష్టప్రయోజనముకలవి కావు. దృష్టమగు ఫలము సంభవించునపు డదృష్టమగు ఫలమును గల్పించుట యుక్తము కాదుగదా! కర్మముల నాచరించు కాలమందు వాని స్వరూపము తెలియనిదే సరిగా నాచరించుటకు వీలుకలుగదు గాన, కర్మాను

1. ఇదియా యదియా యని సందేహము కలిగినప్పు డీ రెండింటిలో నేదో యొక పక్షమును నిర్ణయించుట—

ష్ఠానమున కుపయోగించు నర్థజ్ఞానము మంత్రములవలన జనింపఁ జేయఁబడుచున్నది. తాను స్వయముగా మంత్రముల నుచ్చరింపక గురువునుండి కర్మముల స్వరూపమును దెలిసికొని దానిని స్మరించుచుఁ గర్మముల నాచరించుట తగదా యని శంకింపరాదు. తాను స్వయముగా నుచ్చరించిన మంత్రముల మూలముగానే యర్థమును స్మరించి కర్మముల నాచరించినచో వానినుండి జనించు స్వర్గాదిఫలము లభించునుగాని, వాని నుచ్చరింపక వేఱువిధముగా నర్థమును స్మరించి కర్మముల నాచరించినచో నాఫలము లభింపనేరదని మీమాంసకులనియమము కలదు. అట్టి నియమముచే నదృష్ట మొకటి జనియించుననియు, నా నియమము లేనిచో నట్టి యదృష్టము లోపించి దాని మూలముగాఁ గలుగు స్వర్గాదిఫలము సిద్ధింపనేరదనియు మీమాంసకు లంగీకరించు చున్నారు.

"అయ్యా! మంత్రములు తమయందలి యర్థమును గ్రహింపఁ జేయుటమూలముగాఁ గర్మానుష్ఠానమందు వినియోగించుచున్నవని యేర్పడినదిగదా! వినియోగ మనఁగా శేషముగా నన్వయించుట. శేషమనఁగా నంగము. కాఁగా 'ఇమామగృభ్ణన్‌రశనామృతస్య' అను మంత్రము రశనను బట్టుకొనుటను దెలియఁజేయుచున్నది గాన, రశనను బట్టుకొనుటను దెలియఁజేయుట యనెడు లింగప్రమాణమువలననే 'యీమంత్రము రశనను బట్టుకొనుటయం దంగముగా వినియోగించునది' యని తెలియుచుండఁగా 'ఇమామగృభ్ణన్ రశనామృతస్యేత్య [1]శ్వాభిధానీమాదత్తే' ('ఇమా...స్య' అను మంత్రముచే నశ్వరశనను బట్టుకొనునది) అని మంత్రవినియోగమును నిర్దేశించు వాక్యమెందులకు!" అను శంక కీక్రింద వివరింపఁబడు సమాధానము గలదు. 'ఇమాం......ఆదత్తే' అను వినియోగవాక్యము పరిసంఖ్యకొఱకు

1. అభిధాని=రశన=త్రాడు

నావశ్యకమైనదిగదా! చయనయాగము నాచరించు సందర్భమునందశ్వరశనను గ్రహించుట, గర్దభరశనను గ్రహించుట యను రెండు క్రియలు గలవు. ఇచట లింగప్రమాణమువలన నీమంత్ర మశ్వరశనను గ్రహించుటయందు వినియోగించునని చెప్పఁబడుచుండఁగా, నీలింగప్రమాణముచేతనే యీ మంత్రము గర్దభరశనను గ్రహించుటయందుఁగూడ వినియోగింపవచ్చునని చెప్పఁదగును. కనుక “నీమంత్ర మశ్వరశనను గ్రహించుటయందు మాత్రమె వినియోగింపఁబడవలసినదిగాని గర్దభరశనను గ్రహించుటయందువినియోగింపఁబడరాదు.” అని యీ మంత్రమును గర్దభరశనను గ్రహించుటయందు వినియోగింపఁజేయకుండుట యనెడు పరిసంఖ్యానిమిత్తమై, పైని చెప్పఁబడిన “ఇమా......ఆదత్తే” అను వినియోగవాక్య మావశ్యకము.

ఆ పరిసంఖ్య, (i) స్వార్థత్యాగము (ii) పరార్థస్వీకారము, (iii) ప్రాప్తబాధము’ అను మూఁడు దోషములతోఁ గూడినది. ‘అశ్వాభిధానీమాదత్తే’ అను వాక్యమునకు ‘ఈమంత్రముచే నశ్వరశనను గ్రహింపవలయును’ అనునది స్వార్థము, (=తననుండి గ్రహింపఁబడు నర్థము) అగుచున్నది. అట్టి యర్థ మీ పరిసంఖ్యయందు విడువఁబడుచున్నది. ఈవాక్యమునకే ‘గర్దభరశనను గ్రహించుటయందీమంత్రము వినియోగింపఁబడఁగూడదు’ అనునది పరార్థము, (తననుండి గ్రహింపఁబడని యర్థము.) అగుచున్నది. అట్టి యర్థ మీపరిసంఖ్యయందు స్వీకరింపఁబడుచున్నది. ‘ఇమాం......తస్య’ అను మంత్రమందలి లింగప్రమాణమువలననే గర్దభరశనను గ్రహించుటయందుఁగూడ వినియోగింపఁబడవలసినదిగాఁ బ్రాప్తించు మంత్ర మీపరిసంఖ్యచే బాధింపఁ (నిషేధింపఁ) బడుచున్నది. ఇట్టిపరిసంఖ్య (i) స్వార్థత్యాగము (ii) పరార్థస్వీకారము (iii) ప్రాప్తబాధము నను

మూఁడు దోషములతోఁ గూడినదైనను వేఱుగతి లేకుండుటచే నంగీకరింపఁబడినది. వేఱుగతి యుండునపుడుమాత్ర మీపరిసంఖ్యను గ్రహించుట యుక్తముకాదు.

ఇట్లే 'వికల్పము' కూడ నెనిమిది దోషములతోఁ గూడిన దైనను వేఱుగతి లేనపుడుమాత్ర మంగీకరింపఁబడుచున్నది. దాని కుదాహరణము:—యదాగ్నేయోఽష్టాకపాలోఽమావాస్యాయాం పౌర్ణమాస్యాం చాచ్యుతో భవతి" అను వాక్యమువలన నగ్ని దేవత కొఱకు సమర్పింపఁబడునదియు, నెనిమిదిప్రమిదలయందు సిద్ధపఱుపఁ బడినదియు, నగు పురోడాశ, మాగ్నేయయాగమున కంగమని తెలియఁ బడుచున్నది ఈపురోడాశము భక్ష్యవిశేషము గనుక దీనిని జేయుటకుఁ గావలసిన ద్రవ్యమేదియని యాకాంక్షకలుగఁగా, నేదేనొకద్రవ్యముతో దానిని జేయవచ్చునని చెప్పఁదగియుండ, "వ్రీహిభిర్యజేత" (వ్రీహులచే యజించి యిష్టము నుత్పాదించునది) అను విధివలన వ్రీహియను ద్రవ్యమే యా పురోడాశముకొఱకుపయోగించునది యని తెలియ వచ్చుచున్నది. ఇట్లే "యవైర్యజేత" అను వాక్యమునుండి 'యవలు పురోడాశముకొఱకుపయోగించునవి' యని కూడఁ దెలియవచ్చు చున్నది. ఇచట వ్రీహులును యవలును బురోడాశమను నొకదాని కొఱకే యుపయోగించునవిగాన, వాని రెండింటికే యా పురోడాశ మును నిర్మించుటయందు వి[1]కల్పము సిద్ధించుచున్నది. ఈ రీతిగనే "అతిరాత్రే షోడశినం గృహ్ణాతి" (అతిరాత్రమను యాగమునందు షోడశియను గ్రహమును గ్రహించునది) అను విధివలన షోడశి యను గ్రహమును గ్రహించుట విధింపఁబడుచున్నది. అట్లే "నాతిరాత్రే

1. వికల్పము=పర్యాయముచే వినియోగము. అనఁగాఁ బురోడాశమును నిర్మించుటకు వ్రీహులు గాని, యవలు గాని, వీలు ప్రకార ముపయోగింపఁబడ వచ్చును.

షోడశినం గృహ్ణాతి* (అతిరాత్రమను యాగమునందు షోడశియను గ్రిహమును గ్రహింపరాదు.) అనునిషేధమువలన షోడశిని గ్రహింపకుండుట విధింపఁబడుచున్నది. పరస్పర విరుద్ధములైన 'గ్రహించుట,' 'గ్రహింపకుండుట' అను నీ రెండును నొకే ప్రియోగమునం దాచరించుట యశక్యముగాన, నొకానొక ప్రయోగమునందు గ్రహించుట, మఱియొక ప్రయోగమునందు గ్రహింపకుండుట శక్యములగుటచే, నీ రెండింటికిని నిచట వికల్పము కలుగుచున్నది. అట్టి వికల్ప మీ క్రింద వివరింపఁబడు నెనిమిది దోషములతోఁ గూడినది—అది యెట్లంటేసి:— (i) మొదట వ్రీహివిధివలన వ్రీహుల నుపయోగించునపుడు యవవిధియందలి 'యవలనుపయోగించుట' అనెడి తనయర్థము నాచరింపఁజేయుట యను ప్రామాణ్యము విడువఁబడుచున్నది. (ii) మఱియు, యవవిధి, యవల నుపయోగించుట యనెడి తనయర్థము నాచరింపఁ జేయకుండుట యను నప్రామాణ్యము స్వీకరింపఁబడుచున్నది. (iii). పిదప నింకొక ప్రయోగమందు యవవిధిచే, యవల, నుపయోగించునపుడు, వ్రీహుల నుపయోగించినపుడు విడిచిపెట్టఁబడిన యవశాస్త్రమునందలి ప్రామాణ్య మిపుడు స్వీకరింపఁబడుచున్నది. (iv) మఱియు మొదట వ్రీహుల నుపయోగించునపుడు స్వీకరింపఁబడిన యవశాస్త్రమునందలి యప్రామాణ్య మిపుడు విడువఁబడుచున్నది. ఇట్లు యవవిధి నాచరించుటయందు నాలుగుదోషములు గలవు. (V) ఇట్లే మొదట యవవిధివలన యవల నుపయోగించుటయందు వ్రీహిశాస్త్రమునందలి [1]వ్రీహుల నుపయోగించుటయను తన యర్థము నాచరింపఁజేయుటయను ప్రామాణ్యము విడువఁబడుచున్నది. (VI) మఱియు, వ్రీహివిధి, వ్రీహుల నుపయోగించుట యనెడు తనయర్థము నాచరింపఁజేయకుండుటయను నప్రామాణ్యముస్వీకరింపఁబడుచున్నది. (VII) మరల రెండవప్రయోగమందు వ్రీహివిధిచే వ్రీహుల నుపయో

గించునపుడు, యవల నుపయోగించినపుడు విడిచిపెట్టఁబడిన వ్రీహి శాస్త్రమందలి ప్రామాణ్యము స్వీకరింపఁబడుచున్నది. (VIII) మఱియు, మొదట యవల నుపయోగించునపుడు స్వీకరింపఁబడినవ్రీహి శాస్త్రమునందలి యప్రామాణ్య మిపుడు విడువఁబడుచున్నది. ఇట్లు వ్రీహివిధి నాచరించుటయందును నాలుగు దోషములు గలవు. ఈవిధముగా వికల్పమునం దెనిమిది దోషములు గలవు.

ఎనిమిది దోషములతోఁ గూడిన యీ వికల్ప మొకచోట రెండువిధులచే నొకేకార్య ముత్పాదింపఁబడునపుడు సంభవించును. ఉదాహరణము:—(1) వ్రీహియవలు రెండును నొకే పురోడాశము నుత్పాదించుటకు సమర్థము లగునవిగాన నచట నా రెండు విధులకును వికల్పము సంభవించుచున్నది—(2) ఒకానొకచోట విధివాక్య బలమున వికల్పము సంభవింపఁగలదు; ఉదాహరణము:—“బృహత్పృష్ఠంభవతి” (బృహత్తను పేరుగల సామముచేఁ బృష్ఠమను స్తోత్రము నాచరించునది) అను విధివలన బృహత్తనుపేరుగల సామముచేఁ జేయఁబడు పృష్ఠమను స్తోత్రము విధింపఁబడుచున్నది. “రథంతరం పృష్ఠంభవతి” (రథంతరమను పేరుగల సామముచేఁ బృష్ఠమను స్తోత్రము నాచరించునది) అను విధివలన రథంతరమనుపేరుగల సామముచేఁ జేయఁబడు పృష్ఠమను స్తోత్రము విధింపఁబడుచున్నది. స్తోత్రమనునది ప్రయాజాదులవలె నపూర్వము నుత్పాదించునది గావున నర్థకర్మమగుచున్నది. సామ మనునది యన్నొక సంస్కారమును గలిగించు కర్మమగుటచే గుణకర్మమగుచున్నది. స్తోత్రమునకు సాధనములగు నక్షరములను విశదీకరించుటయనెడి సంస్కారమును జనింపఁజేయుట మూలముగా సామములు స్తోత్రమునకు సాధనములగుచున్నవని మీమాంసకుల మతముగదా! గానముతో నుచ్చరింపఁబడిన ఋగ్వేదమంత్రములచే నింద్రాదుల గుణములను జేర్కొనుట

స్తోత్రమనఁబడును. గానములేకుండ నుచ్చరింపఁబడిన ఋగ్వేదమంత్రములచే నింద్రాదులగుణములను బేర్కొనుటకు శస్త్రమని పేరు. సామమనఁగా గానముతో నుచ్చరించుట. స్తోత్రమునకు సాధనములగు ఋక్కులు స్తోత్రీయములువా. నియందలి త్రివృత్తు, పంచదశ, మున్నగు సంఖ్యావిశేషములు స్తోమము లనఁబడును. ఇచట బృహత్ పృష్ఠము, రథంతరపృష్ఠమునను రెండుస్తోత్రములును, వేఱువేఱగు నపూర్వకముల నుత్పాదించునవగుటచేత, నొకేకార్యము నుత్పాదించునవి కాకపోయినను, "బృహద్వా పృష్ఠంకార్యం" (పృష్ఠమను స్తోత్రమును బృహత్సామముచేనైనఁజేయవచ్చును.) "రథంతరంవాపృష్ఠంకార్యం" (పృష్ఠమను స్తోత్రమును రథంతరసామముచేనైనఁ జేయవచ్చును.) అను విధివాక్యముల బలముచేతనే బృహత్సామమునకును రథంతరసామమునకును బృష్ఠస్తోత్రమును జేయుటయందు వికల్పము సంభవించుచున్నది. (కి)మఱియొకచోట నేదేనొక [1]వ్యవస్థతోఁగూడిన వికల్పము సంభవించు. ఉదాహరణము:—ద్వితీయ ప్రయాజము నాచరించునపుడు నారాశంసమంత్రము [3]తనూనపాన్మంత్రము ననునవి రెండును బ్రయాజమను నొకేకార్యమును సాధించునవగుటచేనా రెండింటికిని వికల్పము సంభవింపఁగా, "రాజన్యవాసిష్ఠానాం నారాంశసోద్వితీయప్రయాజః, తనూనపాదన్యేషామ్" (రాజన్యులకును, వసిష్ఠగోత్రమునందు జనించినవారికిని ద్వితీయ ప్రయాజము నారాశంసమను మంత్రముచే నాచరింపఁబడును. ఇతరులకు 'తనూనపాన్మంత్రము'చే నాచరింపఁబడును.) అను వాక్యమువలన ద్వితీయ ప్రయాజము, రాజన్యవాసిష్ఠులకు నారాశంసమను మంత్రముచేతను,

(1) వ్యవస్థ=ఒకానొక నియమితమైన యేర్పాటు:—2. 'నరాశంస' అను పేరుగల యగ్నిని సంబంధించు మంత్రము. 3 'తనూనపాత్' అను పేరుగల యగ్నిని సంబంధించు మంత్రము.

నితరులకుఁ దనూనపాత్తను మంత్రముచేతను నాచరింపఁబడవలసినది యని వ్యవస్థ యేర్పడుటచే నీవికల్పము వ్యవస్థిత వికల్ప మనఁ బడు చున్నది.

ఈరీతిగా 'చోదన' యను నామాంతరముగల (i) విధివాక్యములకు నంశత్రయముతోఁ గూడిన భావనను విధింపఁజేయుట మూలముగాను (ii) 'ఉద్భిత్' మున్నగు పదములకు యాగనామము లగుట మూలముగాను (iii) అర్థవాదములకు విధింపఁబడువాని యందలి ప్రాశస్త్యమును దెలుపుటమూలముగాను (iv) మంత్రములకు ననుష్ఠింపఁబడు క్రియలను స్మరింపఁజేయుటమూలముగాను ప్రామాణ్యము సిద్ధించుచున్నది. కనుక వేద మంతయు, లోకమువలన దెలియఁబడనివియు, 'ధర్మము' 'అధర్మము' నను నీ రెండింటి రూపముగా నుండునవియునగు విషయములను దెలియఁజేయుట మూలముగాఁ బ్రమాణమగుచున్నదని మీమాంసకుల సిద్ధాంతము.

## స్మృతులు

మనువు మున్నగువారిచే రచింపఁబడిన స్మృతులు గూడ వేదమునే యనుసరించి రచింపఁబడినవగుటచే 'అష్టకలు' మొదలగు ధర్మములవిషయమై ప్రమాణము లగుచున్నవి. 'ఔదుంబరీసర్వా వేష్టయితవ్యా' (మేడికఱ్ఱతోఁ జేయఁబడిన యూపస్తంభ మంతయు దర్భలచేఁ జుట్టఁబడవలసినది) అను స్మృతిమట్టుకుఁ బ్రమాణముకాదు అది "ఔదుంబరీంస్పృష్ట్వా ఉద్గాయేత్." (మేడికఱ్ఱతోఁ జేయఁబడిన యూపమును దాకి యుచ్చస్వరముతో సామగానము చేయవలయును.) అను ప్రత్యక్ష శ్రుతికి విరుద్ధముగా నున్నది. యూపము నంతను దర్భలతోఁ జుట్టినయెడల శ్రుతిచే బోధింపఁబడు విధముగా దానిని స్పృశించుట యశక్యముగదా! "వైసర్జనహోమీయంవాసో

ఉధ్వర్యుర్గృహ్ణాతి* (వైసర్జనహోమమున కంగమగు వస్త్రము నధ్వర్యుఁడు తీసికొనునది) అను స్మృతికూడ నప్రమాణము. ఇది వేదమునకు విరుద్ధముగా లేకున్నను, లోభమను దుర్గుణము మూలముగా నుత్పన్నమైనట్లు తోఁచుచున్నదిగదా!

## శిష్టాచారము

అట్లే శిష్టాచారముకూడ స్మృతి ననుసరించి యుత్పన్నమైనదగుటచేఁ దన్మూలకముగా శ్రుతుల ననుసరించియే యేర్పడిన దగుటవలనఁ బ్రమాణమగుచున్నది. మేనమామకుమార్తెను వివాహమగుట మొదలగు శిష్టాచారములుమాత్ర మప్రమాణములు. "మాతులస్యసుతామూఢ్వా...పతితోభవాత్."* (మేనమామ కొమరితను, పెండ్లియాడి...పాపియగుచున్నాఁడు.) అను స్మృతిచే నిషేధింపఁబడుచున్నది గాన, స్మృతివిరుద్ధమగుచున్నది గదా! ఇట్లు, శ్రుతి, స్మృతి, ఆచారము ననునీమూఁడును, ధర్మము నధర్మమునను నీ రెండింటి విషయమై ప్రమాణములగుచున్నవని వివరింపఁబడినది.

## —* { ధర్మములందలి పరస్పరభేదములను దెలియఁజేయు ప్రమాణములు } *—

ఆధర్మము పలువిధములైనది. అట్టి పలువిధములగు ధర్మములను స్పష్టముగా నిరూపించుటకు (1) 'శబ్దాంతరము, 2 అభ్యాసము. 3. సంఖ్య. 4. సంజ్ఞ. 5. గుణము. 6. ప్రకరణాంతరము.' అను నాఱు ప్రమాణములు గలవు. అవి యీక్రింద నుదాహరింపఁబడుచున్నవి. (1) యాగము, దానము, హోమము నను నీమూఁడు ధర్మములును 'యజతి' (యాగము చేయుచున్నాఁడు.) 'దదాతి' (దానముచేయుచున్నాఁడు.) 'జుహోతి' (హోమముచేయుచున్నాఁడు) అను మూఁడుపదములచే బోధింపఁబడుచున్నవి. 'యజతి' 'దదాతి,' 'జుహోతి,' యనునవి యొకదాని కొకటి పర్యాయపదములుగాక,

శ[1]బ్దాంతరము లగుచున్నవిగాన నిచట శబ్దాంతరమను ప్రమాణముచే, యాగము, దానము, హోమమునను నీమూఁడును, వేఱు వేఱు ధర్మములని తెలియఁజేయఁబడుచున్నవి. దానమనఁగా, దాత వస్తువునందుఁ దనకుఁగల స్వాతంత్ర్యమును విడుచుకొని యట్టి స్వాతంత్ర్యము నితరునికిఁ గలుగజేయుట. (2) "సమిధోయజతి, తనూనపాతంయజతి, ఇడోయజతి, బర్హిషోయజతి, స్వాహాకారంయజతి" అను నైదు విధివాక్యములలో నేదేనొక వాక్యము కర్మమును విధించునదియనియు, మిగిలినవాక్యము లాకర్మము ననువదించి, గుణములను విధించునవియనియు నిర్ణయించుటకుఁ దగిన ప్రమాణ మేమియు లేదుగాన, నన్నివాక్యములును నొకేవిధమగు కర్మమును విధించుచున్నవని చెప్పవలసియున్నది. ఇచట నొకవాక్యముచే విధింపఁబడిన కర్మమే తరువాతి వాక్యములచే మరల విధింపఁబడుట వ్యర్థముగాన, నిట్లొకేకర్మము మరల మరల విధింపఁబడుటవలన, ముందు వాక్యముచే విధింపఁబడిన కర్మములకంటెఁ దరువాతివాక్యములచే విధింపఁబడిన కర్మములు భిన్నములని యేర్పడుచున్నది. ఇటువంటి స్థలములందు 'యజతి' పదముయొక్క యభ్యాసమువంటి శబ్దాభ్యాసములచే నాశబ్దములవలనఁ దెలియఁజేయఁబడు కర్మములు భిన్నభిన్నములని తెలియుచున్నది. (3) "త్రిస ఆహుతీర్జుహోతి" (మూఁడు హోమములనాచరించి యిష్టమును సంపాదించునది.) అను విధివాక్యమందు 'జుహోతి' పదమున కభ్యాసము లేకపోయినను, 'జుహోతి' పదమునకర్థమగు హోమముతో 'మూఁడు' అనుసంఖ్య యన్వయించుటవలన, నీమూఁడుహోమములును బరస్పరము భిన్నములని యేర్పడుచున్నది. కనుక నిచట సంఖ్యవలనఁ గర్మములు భిన్నములని నిర్ణయింపఁబడుచున్నది. (4) "అథైషజ్యోతిః, అథైషవిశ్వజ్యోతిః అథైషసర్వ

1. శబ్దాంతరము=పర్యాయపదము కాని వేఱుపదము. 2. అభ్యాసము=ఆవృత్తి.

జ్యోతిః ఏతేన సహస్రదక్షిణేనయజేత" (వేయేసిరూప్యములు దక్షిణ గాఁగల జ్యోతిస్సు, విశ్వజ్యోతిస్సు, సర్వజ్యోతిస్సు, ననుమూఁడు యాగముల నాచరించుటచే నిష్టము నుత్పాదించునది.) అనువిధివాక్య మందలి మూఁడుయాగములును జ్యోతిష్టోమప్రకరణ (సందర్భ) ము నందు వినఁబడుచున్నవైనను, జ్యోతిష్టోమమను సంజ్ఞకంటె వేఱగు జ్యోతిస్సు, విశ్వజ్యోతిస్సు, సర్వజ్యోతిస్సు, అను సంజ్ఞలచే బోధింపఁ బడుచున్నవి. కనుక నవి భిన్నసంజ్ఞలు గలవగుటచే జ్యోతిష్టోమము కంటె భిన్నములగు యాగము లగుచున్నవి. మఱియు నీమూఁడును వేఱువేఱు సంజ్ఞలు గలవగుటచే నొకదానికంటె నొకటి భిన్నములు కూడ నగుచున్నవి. కాన నిట్లు సంజ్ఞయను ప్రమాణముచేఁ గర్మ భేద మేర్పడుచున్నది. (5) "తప్తేపయసిదధ్యానయతి, సావైశ్వ దేవ్యామిక్షా వాజిభ్యో వాజినమ్" (కాఁగిన పాలలోఁ బెరుఁగు నుంచు నది. దానివలన నేర్పడిన విఱుగుడు విశ్వదేవతలకును, నీటిని వాజి దేవతలకొఱకును సమర్పించి యిష్టము నుత్పాదించునది.) అను విధి యందలి 'సావైశ్వదేవ్యామిక్షా' అను వాక్యమువలన 'విఱుగుడు' అను ద్రవ్యమునకును, విశ్వదేవులను దేవతలకును గల సంబంధము మూలముగా నొక యాగము విధింపఁబడుచున్నది. ఇట్లే 'వాజిభ్యో వాజినమ్' అను వాక్యమువలన, వాజిదేవతలకును, 'మిగిలిననీరు' అను ద్రవ్యమునకును గల సంబంధము మూలముగాఁ గర్మాంతరము విధింపఁబడుచున్నది. కాని మొదట విధింపఁబడిన వైశ్వదేవయాగము ననువదించి, [1]వాజినమను గుణము విధింపఁబడుటలేదు. మొదటియాగ మునం దామిక్షయను గుణము విధింపఁబడియుండుటచేత, నాయాగ మునందే వాజినమను మఱియొక గుణమును విధించుట యుక్తము కాదుగదా! వ్రీహులకును యవలకునువలెనే యామిక్షకును వాజి

(1) వాజినము=విఱిగినపాలలోని నీరు

నమునకును వికల్పమని యేల చెప్పరాదని శంకింపరాదు. ఇచట నామిక్షావాజినములు స[1]మశిష్టములు కావుగదా! ఇవి వి[2]షమ శిష్టములు గాన వీనికి వికల్పము చెప్పుట యుక్తముకాదు. వైశ్వదేవ యాగమున కుత్పత్తిగల వాక్యమునందే యామిక్షయను గుణము శిష్టము (విధింపఁబడినది) అగుచున్నదిగాన, నది యుత్పత్తిశిష్టగుణ మగుచున్నది. 'సావైశ్వదేవ్యామిక్షా' యను వాక్యమువలన నుత్పన్న మైన వైశ్వదేవయాగమును గూర్చి, "వాజిభ్యో వాజినమ్" అను వాక్యాంతరముచే వాజినమనుగుణము శిష్టమగుచున్నదిగాన, వాజిన ముత్పన్నశిష్టగుణ మగుచున్నది. కాని రెండింటిలో నుత్పత్తిశిష్ట గుణమగు నామిక్ష, వైశ్వదేవయాగమను కర్మముయొక్క యుత్పత్తి కాలమందే దాని ంగముగాఁ దెలియఁబడిన దగుటచేత, నుత్పన్న శిష్టమగు వాజినముకంటె బలవత్తరమగుచున్నది. ఉత్పన్నశిష్టమగు 'వాజిన' గుణము, వైశ్వదేవయాగోత్పత్తికిఁ బిదప నాలస్యముగాఁ దెలియఁబడినదగుటచే దుర్బలమై యాగమునందుఁ బ్రవేశము నొంద లేక, వాజులను దేవతాంతరములతో సంబంధమును బొందుట మూల ముగాఁ దానుండు "వాజిభ్యోవాజినమ్" అను వాక్యమువలనఁ గర్మాం తరము విధింపఁబడుచున్నదని తెలియఁజేయుచున్నది. ఇట్లు గుణమును ప్రమాణముచేఁ గర్మములు భిన్నములని తెలియఁబడును. ఇచట నామిక్ష యనఁగా విఱిగిన పాలయందలి గట్టిపదార్థము. (విఱుగుడు.) దానిలో మిగిలిన జలమునకు వాజినమనిపేరు. (6) "ఉపసద్భిశ్చ రిత్వామాస మగ్నిహోత్రంజుహోతి" (ఉపసత్తులను వ్రతములు సలిపి పిదప నొకమాసమువఱకగ్నిహోత్రము నాచరించి యిష్టము నుత్పా దించునది) అనువిధి, కుండపాయినామయనమను యాగముయొక్క

---

(1) సమశిష్టములు=స్వతంత్రముగాను ప్రత్యేకముగాను విధింపఁబడినవి.

(2) హెచ్చుతగ్గులుగా విధింపఁబడినవి.

ప్రకరణమునందుఁ వినఁబడుచున్నది. ఈవిధికిముందు దగ్గఱగాఁ గర్మ మేదియు విధింపఁబడలేదు. కావునఁగుండపాయినామయనమను నపూర్వకర్మముయొక్క సన్నిధానమనెడి ప్రకరణాంతరము (మఱియొకదానిసందర్భము) వలన నీవిధియందుఁ బ్రసిద్ధమగు నగ్నిహోత్రమను కర్మముతో సమానస్వభావము గలదియు, నగ్నిహోత్రమను పేరు గలదియు, నగు కర్మాంతరము విధింపఁబడుచున్నది. కాని యీ విధి యందలి 'యగ్నిహోత్రపదముచేఁ బ్రసిద్ధమగు నగ్నిహోత్రమను కర్మము ననువదించి గుణము విధింపఁబడుటలేదు. ఇది గుణవిధియే యైనచో వేఱువిధియందుఁ బ్రాప్తమైన యగ్నిహోత్రమను కర్మము నుద్దేశించి 'యూనంతర్యము' (అనంతరముజరుగునదగుట) 'మాసము' అను ననేకగుణములు విధింపఁబడుటచే వాక్యభేదము రావలసివచ్చును. కావున నిచటఁ బ్రకరణాంతరమను ప్రమాణముచేఁ గర్మము వేఱని యేర్పడుచున్నది. ప్రసిద్ధాగ్నిహోత్ర మనఁగా నియమముగా నిత్యమును నాచరించు నగ్నిహోత్రమను కర్మము. ఇట్లు శబ్దాంతరము మున్నగు నాఱు ప్రమాణములచేఁ గర్మములందలి పరస్పర భేదములు తెలియఁజేయఁబడుచున్నవి.

వేదాదులవలనఁ దెలియఁబడు విషయము, 1 క్రత్వర్థము,[1] 2 పురుషార్థము, 3 ఉభయార్థమునని మూఁడువిధములుగా నున్నది. ప్రయాజములు, మున్నగునవి క్రత్వర్థము లనఁబడును. ఫలమును దాని కరణము (సాధనము)ను బురుషార్థ మగుచున్నది. ఉదాహరణము:- స్వర్గము మున్నగు ఫలము. జ్యోతిష్టోమాది సాధనము. దధిమున్నగు నవి యన్ననో యుభయార్థ మనఁబడుచున్నవి. "దధ్నాజుహోతి" అను వాక్యమునందు దధి, ఫలసంబంధము లేకుండఁగ హోమము నకు గుణముగా విధింపఁబడుచున్నదిగానఁ గ్రత్వర్థ మగుచున్నది.

(1) క్రతువు నిమిత్తమగునది.

"దధ్నేంద్రియకామస్య జుహుయాత్" అను విధియందు, దధియింద్రియమను ఫలముకొఱకు విధింపఁబడుచున్నదిగానఁ బురుషార్థ మగుచున్నది. కావున దధి, యుభయార్థమగుచున్నది ఇందులకు "ఏకస్య తూభయత్వేసంయోగ పృథక్త్వమ్" (ఒక వస్తువు రెండు ధర్మములు గలదను విషయము వాక్యభేదముచేఁ దెలియఁజేయఁబడుచున్నది) అను వాక్యము ప్రమాణము. ఇచట సంయోగమనఁగా వాక్యము. పృథక్త్వమనఁగా భేదము. అట్టి వాక్యభేద మొకవస్తువు రెండు ధర్మములు గలదని తెల్పుట కుపచరించును. ప్రయాజాదులు క్రతువు నిమిత్త మాచరింపఁబడునవిగానఁ గ్రత్వర్థమగు ప్రయాజాదులకుఁ గ్రతువు ప్రయోజకమగుచున్నది. జ్యోతిష్టోమాదియాగము ఫలము కొఱకే యాచరింపఁబడుచున్నదిగానఁ, బురుషార్థమగు జ్యోతిష్టోమాదికమునకు, స్వర్గాదిఫలము ప్రయోజక మగుచున్నది. ప్రయోజకమనఁగా నాచరింపఁజేయునది. విధివాక్యము(1) దేని నిమిత్తము దే(2)ని నాచరింపఁజేయునో య[1]ది దాని[2]కి, బ్రయోజక మగుచున్నది. "దర్శపూర్ణమాసాభ్యాం స్వర్గకామోయజేత" అను దర్శాదివిధి స్వర్గమునిమిత్తము దర్శాదుల నాచరింపఁజేయుచున్నది. గాన, స్వర్గము దర్శాదియాగములకుఁ బ్రయోజకమగుచున్నది. ప్రయాజాదులనువిధింపఁజేయు 'సమిధోయజతి' ఈమున్నగువిధి, దర్శాదియాగములనిమిత్తము ప్రయాజాదుల నాచరింపఁజేయుచున్నదిగాన, దర్శాదియాగములు ప్రయాజాదులకుఁ బ్రయోజకములగుచున్నవి. "తప్తేపయసిదధ్యానయతి, సావైశ్వదేవ్యామిక్షా, వాజిభ్యోవాజినమ్" అను కాఁగిన పాలలో దధినుంచుటను విధింపఁజేయు విధి, కాఁగినపాలలోదధినుంచుటను 'ఆమిక్ష' కొఱకు విధింపఁజేయుచున్నది గాని, వాజినముకొఱకు విధింపఁజేయుటలేదు; ఆమిక్షకొఱకుఁ గాఁగిన

(1) రెండు వేఱు వాక్యములు. (2) ఆచరింపఁజేయునది.

పాలలో దధినుంచుటను జరుపఁగా, వాజినము తనంతనే సిద్ధించుచున్నదిగదా! కావున దధ్యానయనమునం దామిక్షయే ప్రయోజకము కాని వాజినము కానేరదు. "పురోడాశకపాలేన తుషానుపవపతి" (పురోడాశమును గాల్చు ప్రమిదతో బియ్యమునందలి పొట్టును జెరిగి తీసివేసి యిష్టము నుత్పాదించునది.) అను విధిచేఁ బురోడాశమును గాల్చు కపాలము తు[1]షోపవాపమున కంగముగా విధింపఁబడుచున్నది అయినను బురోడాశమును గాల్చుటకు ముఖ్యముగా సిద్ధపఱుపఁబడిన కపాలము చేతనే తుషోపవాపముకూడఁ జరుపఁబడుచున్నది. కానఁ, గపాలమునకుఁ బురోడాశమే ప్రయోజకముకాని, తుషోపవాపము ప్రయోజకము కానేరదు. ఇట్లే యితర సందర్భములందుఁగూడ దేని కేది ప్రయోజకమగునో యూహించునది.

## —* ధర్మముల నాచరించు క్రమమును బోధించు ప్రమాణములు *—

"అయ్యా! విధివాక్యమువలనఁ బ్రధానకర్మమంగములతోఁ గూడఁ జేయఁబడవలసినదిగా విధింపఁబడుచున్నది. ఇచటఁ బ్రధానములైనవియు, నంగములైనవియునగు కర్మము లనేకములుగా నుండుటవలన, నవి యొకదానివెనుక నొకటి యాచరింపఁబడవలసియున్నవి. ఇట్లుండ వానిలో నేది ముందో యేది వెనుకనో యనెడు క్రమమును నియమించు (=నిర్ణయించు=నిరూపించు) ప్రమాణ మేది" అని శంకింపరాదు. ఇట్టి క్రమమును నియమించుటకు శ్రుతి, అర్థము, పఠనము, స్థానము, ముఖ్యము, ప్రవృత్తి యను నాఱు ప్రమాణము లున్నవిగదా! అవి యీక్రిందఁ వివరింపఁబడుచున్నవి. (1) "[2]అధ్వర్యుర్గృహ

1. తుష=పొట్టు. ఉపవాపము=చెరిగి తీసివేయుట. 2. ఈవిధి ద్వాదశాహమనుయాగముయొక్క సందర్భమునందు వినఁబడుచున్నది.

పతిం దీక్షయిత్వా బ్రహ్మాణం దీక్షయతి తత ఉద్గాతారం తతో హోతారమ్" (అధ్వర్యుఁడు మొదట యజమానుని దీక్షలోఁ బ్రవేశింపఁజేసి పిదప బ్రహ్మను నటుపిదప నుద్గాతను దరువాతహోతనుదీక్షయందుఁ బ్రవేశింపఁజేయవలయును.) అను వాక్యమందు 'దీక్షయిత్వా' (దీక్షలోఁ బ్రవేశింపఁజేసి) అను పదమందలి [1]'క్త్వా' (చేసి) ప్రత్యయమనెడి శ్రుతివలన, మొదట గృహపతిదీక్షయుఁ బిదప బ్రహ్మదీక్షయు నను నీమున్నగు క్రమము నిర్ణయింపఁబడుచున్నది. (2)"సమిధో యజతి, తనూనపాతం యజతి, ఇడో యజతి, బర్హిషో యజతి, (బర్హిర్యజతి), స్వాహాకారం యజతి" అను పాఠమునందలి విధివాక్యములక్రమమునుండియే, వానివలన నాచరింపఁజేయఁబడు సమిదాదియాగముల నాచరించు క్రమము బోధింపఁబడుచున్నది—(3) "అగ్నిహోత్రం జుహోతి" (అగ్నిహోత్రమనెడు హోమము నాచరించి యిష్టము నుత్పాదించునది.) "యవాగూం పచతి" (గంజిని గాచునది) అను విధివాక్యముల సందర్భమునందు గంజి కాచుటకు హోమమర్థము (ప్రయోజనము) గనుక, గంజి కాచుటకుఁ బూర్వము హోమముచేయుట యశక్యము కావున నిచటఁ బాఠక్రమమునువదలి, యర్థక్రమమునే యవలంబింపవలసియున్నది. అర్థమనఁగాఁ బ్రయోజనము. దాని ననుసరించు క్రమము 'అర్థక్రమము' అనఁబడును. ఈ యర్థక్రమముచే నిచట, మొదట గంజికాచుట, పిదప హోమముచేయుట జరుపఁబడవలసియుం

(1) క్త్వా=రెండు క్రియలలో మొదట జరిగినదానిని దెలియఁజేయుటకు 'క్త్వా' (తెలుగునందు 'ఇ') ప్రత్యయ మంతమందుఁగల యసమాపకరూపము ప్రయోగింపఁబడును. [ఉ. రాముఁడు వారధికట్టి (కట్టు+ఇ) లంకలోఁ బ్రవేశించెను.]

డును. (4) అట్లే [1]"సప్తదశ ప్రాజాపత్యాన్ పశూనాలభతే" (ప్రజాపతి దేవతగాఁ ఉద్దేశింపఁబడిన పదునేడు పశువుల నాలంభించి యిష్టము నుత్పాదించునది) అను విధినుండి పదునేడుపశువులు గలదియుఁ, బ్రజాపతి దేవతగాఁ గలదియు నగు నొక యాగము కర్తవ్యముగాఁ దెలియఁబడుచున్న ఈయాగముయొక్క సందర్భమునందుఁ బశువులకుఁ జేయు సంస్కారములలో మొదటిదగు '[2]ఉపాకరణము' ఏదే నొక పశువున కారంభించి యొక వరుసగాఁ జేయఁబడి, తుదకేదేనొక పశువునందు ముగింపఁబడఁదగియున్నది. రెండవదగు నియోజనము మున్నగు సంస్కారము లన్ననో, యుపాకరణములు పశువుల కేక్రమమున జరుపఁబడినవో యదే క్రమమున నాచరింపఁబడఁదగియున్నవి. ఇట్లేల చేయవలయునంటేని, ప్రకృతియాగమగు సోమయాగమునం దగ్నిషోమీయమను పశువొక్కటే యున్నది గనుక దానికి మొదటిక్షణమున, నుపాకరణముచేసి, రెండవక్షణమందే, నియో[3]జనమును, మూడవక్షణమందే, ప్రోక్షణమును, (మధ్యమధ్య నాలస్యము చేయుటకు నిమిత్తమేదియు లేదు గాన,) నొకేవరుసగాఁ జేయుటకు వీలగుచున్నది. ఈ (వికృతియగు) ప్రజాపత్యయాగమునం దన్ననో, పదునేడు పశువులును నొకేసారి వినియోగింపఁబడవలసినదని విధి యుండుటంజేసి, మొదట నేదేనొక పశువునకుఁ జేయఁబడిన యుపాకరణమునకును, నా యుపాకరణము చేసిన పశువునకే, యనం

(1) ఈవిధి వాజపేయమను యాగముయొక్క సందర్భమునందు వినఁబడుచున్నది. (2) పశువు నాహవనీయమను నగ్నికిఁ దూర్పుదిశను, బశ్చిమాభిముఖముగా నిలుచుండఁజేసి, రెండు దర్భలతోను, బర్హిశ్శాఖతోను స్పృశించి, యాయా దేవతలకు నిచ్చునట్లు సంకల్పించుట—(3) పశువును యూపస్తంభమునకుఁ గట్టుట.

తరము చేయఁబడు నియోజనమునకును, బదునాఱు క్షణములకంటె నెక్కువ వ్యవధాన ముండరాదు. అట్లుకాక నియోజన ముపాకరణము చేసిన క్రమముననే, మొదటి పశువునకుఁ జేయక, యితరపశువులకు జేసి, తుదికి మొదటి పశువునకుఁ జేసినయెడలఁ, బ్రథమ పశువునకు జేయఁబడిన యుపాకరణమునకును, నియోజనమునకును, శాస్త్ర సమ్మతముకాని పదునాఱు క్షణములకంటె నెక్కుడు వ్యవధానము సంభవించెడిని. అట్లు శాస్త్రసమ్మతముకాని వ్యవధానము సంభవింకుండుటకుఁగాను, నుపాకరణ మేక్రమమునఁ బ్రవృత్తమైనదో య క్రమమున నియోజనము మొదలగు సంస్కారములుకూడఁ చేయ బడవలసినవి. కాఁగా నియోజనాదుల క్రమ ముపాకరణముయొక ప్రవృత్తి ననుసరించియుండుటచే 'ప్రవృత్తిక(1)మము' అనఁబడుచున్న (5) అట్లే జ్యోతిష్టోమమందు 'ఔప(2)వసథ్యము' అను దినము నారంభించి క్రమముగా (3)మూఁడు వేఱువేఱు కాలములం 'అగ్నీషోమీయము, సవనీయము, అనూబంధ్యము' అను మూఁ పశువులు వినియోగింపఁబడును. సోమయాగమునకు వికృతియగు సాద్యస్క్రమను యాగమునందు, "సహపశూనాలభతే" (ప

---

(1) ,,సహపశూనాలభతే'' అనునది. (2) జ్యోతిష్టోమయాగమునందు సరసమును సిద్ధపఱచుదినమునకుఁ బూర్వమైనదియు, అగ్నీషోమీయపశువును వినియోగించునదియునగు దినము. అగ్నీషోమీయపశువు ఔపవసథ్యమనుదినమందు, సవనీయపశువు సుత్యాదివసమనెడి యైదవరోజున ఆశ్వినగ్రహమును గ్రహించినపిదప, అనూబంధ్యపశువు అవభృథమైనతరువాతను ఆలంభింపఁబడును. (4) సోమయాగము వికృతియగు యాగము. దీనియం దగ్నీషోమీయము మున్నగు మూఁడు పశువులొకేసారి వినియోగింపఁబడును.

గ్నేయయాగము ముందును, సాన్నాయ్యయాగము లనంతరమునను నాచరింపఁబడుచున్నవి. ఇట్లున్నను, ప్రయాజములు చేయఁగా శేషించిన యాజ్యముచేఁ జేయఁబడు నభిఘారణము, 'అంగక్రియ'ల యాచరణక్రమమును విడిచి, ముఖ్యయాగముల క్రమమునే యవలంబించి, మొదట నాగ్నేయపురోడాశమునకును, పిదప సాన్నాయ్యమగు దధిపయస్సులకును జేయఁబడవలసియున్నది. ఇచట నభిఘారణము చేయు క్రమము, ముఖ్యయాగముల క్రమము ననుసరించి యేర్పడుటవలన, ముఖ్యక్రమమగుచున్నది. కాఁగా, నిట్లు వివరింపఁబడిన 'శ్రుతి' 'పాఠ' 'అర్థ' 'ప్రవృత్తి' 'స్థాన' 'ముఖ్య' క్రమముల ననుసరించియే యాయా కర్మము లాచరింపఁబడవలెను. అట్లు చేయక, యీ క్రమము నుల్లంఘించి యాచరింపఁబడినచో నవి వ్యర్థము లయ్యెడిని.

ఇట్లు 'ఆంధ్రమీమాంసాపరిభాష' యను గ్రంథము

సమాప్తము.



సరస్వతీ పవర్ ప్రెస్, రాజమండ్రి.

# తప్పొప్పుల పట్టిక



ఈగ్రంథము ముద్రించునప్పుడు ప్రమాదవశమున ననేకములగు నక్షరపుఁ బొరపాట్లు కలిగినవి. వానిలో తవర్గమునందలి రెండవయక్షరమునకు నాలుగవ యక్షరమును, నాలుగవ యక్షరమునకు రెండవ యక్షరమును దఱచుగా నుపయోగింపఁబడుట, అరసున్న యుండవలసిన పెక్కుచోట్ల లేకుండుట, కొన్నిస్థలములం దక్కఱలేనిచోట నుండుట యనునవి ప్రధానములు—ఒత్తుండవలయుచోట్ల విడువఁబడినది. అట్టి వానిని బండితులు సవరించుకొని పఠించుటకుఁ బ్రార్థించుచున్నాను. మిగిలిన వీక్రింద వివరింపఁబడుచున్నవి.

| పేజి. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | 1 | ముందుఁ జెప్పఁబడఁబోవు | ముందు వివరింపఁబడఁబోవు |
| 3 | 18 | నిర్దేశించ్చి | నుద్దేశించి |
| 4 | 22 | బలసి | బలిసి |
| 11 | 23 | నాన్నాయ్యము | సాన్నాయ్యము |
| 14 | 19 | సిద్ది | సిద్ధి |
| 15 | 20 | ఈశనను | ఈరశనను |
| 16 | 9 | వానిలో నపేక్షితము | వానిలోన నపేక్షితము |
| 24 | 22 | లగుటజేతను | లగుటచేతను |
| 30 | 10 | ఉపయుక్తమైరి | ఉపయుక్తులైరి |

| | | | |
|---|---|---|---|
| 38 | 2 | ఉత్పత్తిసంస్కా | ఉత్పత్తిసంస్కార |
| 3, | 9 | శేయఁబడ | చేయఁబడ |
| 36 | 22 | విధివిజ | |
| 39 | 2 | ఇట్లీవేదము | ఇట్లే వేదము |
| 43 | 23 | జ్యోతిష్ఠోమ | జ్యోతిష్టోమ |
| ,, | 26 | భుజింమచున్నాఁడు | భుజించుచున్నాఁడు |
| 48 | 11 | నీయాజ్ఞిట | నీయాజ్ఞిటి |
| 49 | 7 | వరము | వర్ణము |
| 56 | 21 | యరవాదము | యర్థవాదము |
| 62 | 18 | యవవాస్త్రము | యవశాస్త్రము |
| 64 | 6 | యపూర్వక | యపూర్వ |
| 66 | 10 | భవాత్ | భవేత్ |
| 69 | 11 | దానింగముగా | దాని కంగముగా |
| 69 | 13 | యోగోత్పత్తికి | యాగోత్పత్తికి |



# ఆంధ్ర మీమాంసార్థసారము

వెల 1—0—0

ఒక్కపర్యాయము 1 డజను ప్రతులు తెప్పించుకొనువారికొక ప్రతియు 100 ప్రతులు తెప్పించుకొనువారికి 10 ప్రతులును ఉచితముగా నీయఁబడును. వలయువారీ క్రింది చిరునామాకు వ్రాసి తెప్పించుకొనవచ్చును.

కూచిమంచి రామమూర్తి
కూచిమంచివారి అగ్రహారి
అమలాపురము,
తూర్పు గోదావరి జిల్లా,